# హిందూమతము
## భగవన్మతము

ఉభయభాషాప్రవీణ

శ్రీమాన్ అబ్బరాజు వీరరాఘవస్వామి గారు, P.O.L

(1900-1963)

మున్నుడి :

డాక్టర్. అబ్బరాజు సీతారామచంద్రమూర్తి, Ph.D.

చిత్రభాను
శ్రావణపూర్ణిమ
22-8-2002

మూల్యము . రు. 25/-

**అంకితము**
# శ్రీ వరదాభయ కోదండరామస్వామివారికి

ప్రతులకు .
**డాక్టర్. అబ్బరాజు సీతారామచంద్రమూర్తి, Ph.D.**
3-29-14/6, కృష్ణనగర్ 3/7,
గుంటూరు - 522 006.

గమనిక :
**విశిష్టాద్వైతము by డాక్టర్. అబ్బరాజు సీతారామచంద్రమూర్తి,**
కొన్నవారికి ఈ పుస్తకము ఉచితము

---

**ముద్రణ :**

**వెల్‌కమ్‌ప్రెస్ ప్రైవేట్ లిమిటెడ్,**
**2వ లైను, బ్రాడీపేట, గుంటూరు-522 002**
**☎ : 231086**

శ్రీమతే నారయణాయ నమః

# అభిప్రాయము

శ్రీమాన్ అబ్బరాజు వీరరాఘవ స్వామివారు నాకు మార్గ దర్శకులును, పూజ్యులును వీరు రచించిన ఈ లఘుకృతి, పరిణతములైన భావములకు, అనుభవములకు నెలవైన గురు కృతి. మన భారతదేశమున పరిణామము లందిన వివిధ మతముల సంస్కృతి, యధార్థ విషయములను ఆకళించుకొని ముందుకు నడచు వారికి ప్రగతి. అవకాశాను సారముగా తమ తమ భావములను ప్రచారము చేసి కొనుటకై ఏర్పడిన వివిధ దర్శనములను సందర్శింప జేయు ఆదర్శము (అద్దము). నేటి పరిస్థితులను తెలిసికొని చిత్త ప్రశాంతిని పొందగోరు వారికి ఉపదేశము సత్యము నెరుగగోరు వారికి ఉత్తమ సందేశము కుల శబ్దము వంశ పర్యాయ పదమైనప్పటికినీ వాడుకలో కల ప్రాచుర్యమును బట్టియే ఇందు Casteకు పర్యాయపదముగా వాడబడినదని అనుకొనుచున్నాను మున్నుడిలో ప్రధాన గ్రంథ విషయములు కొలదిగా అందింపబడినవి మరల నాయభి ప్రాయంలో వ్రాయుట పునరుక్తియేయగును. అందఱు ఈ కృతిని చదివి పరస్పర ద్వేషము లేని సన్మార్గములో నడతురు గాక.

ఇట్లు

**విద్వాన్ K.E.T. రామానుజాచార్యులు,M.A**

**3-9-2002** బాపట్ల.

ప్రతులకు

డాక్టర్ అబ్బరాజు శ్రీరామదేవశర్మ
శ్రీకృతి హోమియో క్లినిక్
నాగవలి లక్ష్మీపురము, 1వ వీధి
బాపట్ల - 522101 (గుంటూరు జిల్లా)

శ్రీలక్ష్మీ నృసింహాయ నమః



# ప్రశంస

'హిందూమతము' గ్రంధకర్త శ్రీమాన్ అబ్బరాజు వీరరాఘవ స్వామి వారు నాపెదపినతండ్రి. నాకు అక్షరాభ్యాసముజేసిన గురు దేవులు మరియు నాకు సమాశ్రయణము జరిపిన ఆచార్య స్వాములు. వైష్ణవేష్టి, వైభవేష్టిలను జేసి భగవద్భాగవత కైంకర్యము లొనరించిన మహనీయులు. వైశ్వ దేవము, నిత్యాగ్ని హోత్రములతో జీవితమును సాగించిన గొప్ప కర్మిష్ఠులు. సంస్కృతాంధ్ర పండితులు. శ్రీమదాంధ్ర విష్ణుపురాణ మహాగ్రంధమును రచించిన మహాకవులు వరదాభయ కోదండరామ, సీతాపిరాట్టి, శతక ద్వయములుగా పలు గ్రంధములను రచించి యున్నారు. విశిష్టాద్వైత మత ధర్మ ప్రవణులు. మార్గదర్శకులైన ఆచార్యులు.

ఈ గ్రంధమును అచ్చువేయించి, వెలుగునకు దెచ్చుటే కాక, చక్కని మున్నుడి భావ సమర్ధముగా వెలువరించిన సహృదయ మూర్తి డా॥ అబ్బరాజు సీతారామచంద్రమూర్తి, M.Sc.Ph.d, గారు నాపిన, పినతండ్రి శ్రీమాన్ సూర్యనారాయణగారి జ్యేష్ఠపుత్రులు శ్రీ సూర్యనారాయణగారు ఆంధ్రభారత నిఘంటు రచయితలు. వైద్యశాస్త్రమైన యోగతరంగిణీ గ్రంధకర్తలు పలు గ్రంధములు రచించిన కవులు. మా అన్నగారు డా॥ సీతారామచంద్రమూర్తి గారు రసాయన శాస్త్రాచార్యులుగా, ధార్వాడ విశ్వవిద్యాలయమున ప్రధానాచార్యులుగా బహుకాలము శిష్యప్రశిష్యుల దీర్చిదిద్దిన దేశికోత్తములు, మీదు మిక్కిలి విశిష్టా ద్వైతమతాభినివేశులు. విశిష్టాద్వైత మతము అనుగ్రంధమును వ్రాసి పండిత లోకముచే బ్రశంసింపబడిన మాన్యులు.

మా పినతండ్రులిర్వురకు, జ్యేష్టభ్రాతయైన శ్రీమాన్ వెంకట రమణయ్య గారి పెద్ద కుమారుడను నేను. మాతండ్రులు ముగ్గురన్న దమ్ములు ప్రాక్తన పుణ్యవిశేషమున శ్రీమద్విశిష్టాద్వైత మార్గమున ఆర్షధర్మప్రవణులై ప్రపన్నులై శ్రీమన్నారాయణుని సేవించి, తరించిన ధన్యాత్ములు. మా ఆచార్యస్వాములు వ్రాసిన గ్రంధమునకు నేను అభిప్రాయము వ్రాయుటేమి! ఆసాహసము నాకు లేదు. కానీ గ్రంధమున సూక్తి సుందరమై, రసబంధురముగా, సులభగ్రాహ్యమగునట్లు, నావంటి సామాన్యులకు నర్ధమగునట్లు భగవన్మతప్రధానాంశములు తెలియ జేయబడినవని వినమ్రుడనై తెలుపుకొనుచున్నాను.

ఇందు - ప్రవృత్తి నివృత్తి మార్గములు వివరింపబడిన తీరుహృద్యము. సర్వజీవులను మోక్షార్హులేయని, అష్టాక్షరీ మహామంత్రాను ష్ఠానము, శరణాగతి, భరన్యాసములు, జీవుని కర్మ బంధములను విడిపించి మోక్షము నందీయగలవని చక్కగా దెలుపబడినది!

పుణ్య పాపకర్మల ఫలమెట్లు అవరోధమో, నిష్కామమార్గమున మన సర్వకర్మలు భగవదార్పణ జేయవలెనని గీతాసారము వివరితమైన సంభాషణలలతి మాటలతో మనసునకు హత్తుకొన గలవని చదువరు లెరుగంగగలరు.

గ్రంధము చివరగా (11 అంశము) పశుపక్షాదులందుండిన జీవుడు విశేష విజ్ఞానియైన మానవ సంబంధము వలన నీ శరీరము నుండియే మోక్షమ బొందవచ్చునా అని చదివినప్పుడు జటాయు మహారాజు శ్రీరామ చంద్రుల కృపతో పరమ పదప్రాప్తి యైన విషయము హృదయములందు రసించకపోదు.

పాపము ఇనుప సంకెళ్ళు. పుణ్యము బంగారు సంకెళ్ళు మోక్షముగోర వాలీ సంకెళ్ళ విడుతురు (26పేజి) అని చదువు కొనినప్పుడు కొన్ని సంవత్సరములు నేనుగా స్వామికి విన్నపాలు చేసిన పద్యము గుర్తుకు వచ్చినది. నావంటి వానికి ఈ సంకెళ్ళు భేదించుకొనెడు శక్తి లేదు. అందుకాపరంధాముడే కృప జూప వలెనని విన్నపము.

మా, మా ! జేసిన పాపపుణ్యచయమే మాకాళ్ళ సంకెళ్ళు! యో
స్వామీ ! మీ కృపనందుకోదలప మాప్రారబ్ధ మడ్డంకి! దే
వా ! మీ సాయములేక దీని దరియింపన్ జాలనే మాత్రమ
య్యా! మీదాసులరక్షణల్ తమవిగావా! నృసింహ ప్రభూ !

అని విన్నపాలు చేసికొనుచున్నాను.

శ్రీమాన్ వీరరాఘవ(య్య) స్వామివారు బహుధా గౌరవనీయులు. వారి పలుగ్రంధములింకను వెలుగునకు రావలసియున్నవి. అవి వెలుగునకు వచ్చినచో ధార్మికలోకమెంతయో లాభపడగలదని నాయాశంస!

మాఅన్నగారు ఆచార్య డా॥ అబ్బరాజు సీతారామచంద్రమూర్తి గారికి, యిందుమూలముగా నా ప్రత్యేక ధన్యవాదములర్పించుకొనుచున్నాను.

**12-9-2002**

భవదీయుడు
**అబ్బరాజు శ్రీనివాసమూర్తి,**
గుంటూరు

**అబ్బరాజు శ్రీనివాసమూర్తి,**
విశ్రాంత ఆంధ్రఉపన్యాసకులు
శ్రీలక్ష్మీ నృసింహ నిలయం
ఇ.నెం. 26-39-103, చైతన్యనగర్,
ఏ.టి.అగ్రహారం (ఎక్స్‌టెన్షన్) గుంటూరు -4.



ఉభయభాషాప్రవీణ

# శ్రీమాన్ అబ్బురాజు వీరరాఘవస్వామి గారు, P.O.L.

(1900 - 1963)

# మున్నుడి

అజ్ఞానాంధకారములో జన్మించిన నాకు కళ్లు తెరిపించి జ్ఞానము ప్రసాదించినది ఆచార్యులు. వారికి నా హృత్పూర్వక పాదాభి వందనములు. ఆ ఆచార్యవర్యులే ఈ హిందూమత పుస్తక రచయిత శ్రీమాన్ అబ్బరాజు వీరరాఘవ స్వామిగారు. వీరు నాకు ఆచార్యులే కాక జ్యేష్ఠ పితృవ్యులు. జ్ఞానానుష్ఠానపరులు, నిత్యాగ్ని హోత్రులు అయినవారు తమ జీవిత చరమాంకములో (1957) ఈ చిన్ని పుస్తక రచనతోబాటు ఇంక కొన్ని రచనలు చేసిరి. వారు ఆగష్టు 23, 1963న పరమపదించిరి. కొన్ని నెలల క్రిందట ఈ పుస్తకమును వారి కుమారుడు శ్రీమాన్ శ్రీరామదేవ శర్మ నాకు చూపించి, ఈ పుస్తకమును వెలుగు లోనికి తీసికొని రావలసినదిగా నన్నుకోరెను అప్పుడు ఈ పుస్తకమును చదువుట తటస్థించినది సనాతన ధర్మమును పాటించువారు కులము, మతము, అను అంశములపై ప్రదర్శించిన సమభావము మిగుల శ్లాఘనీయము. ఈ రెండు అంశములను ప్రమాణ పూర్వకముగా సంక్షిప్తముగా చర్చించి వారి అభిప్రాయములను సమర్థించుటయే నా కోరిక. ఎంతవరకు కృతకృత్యుడనైతినో విజ్ఞులు నిర్ణయింతురు గాక.

వేదసూక్తములలో "వేదాశ్చ చత్వారో వర్ణాః" బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రాః తేషాం పూర్వః పూర్వోజన్మతః శ్రీయాన్ అని యున్నది. మానవుల పూర్వజన్మ ఫలముచే ఆయాకర్మ వాసనలకు దగినట్లు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులుగా జన్మ నొందెదరు. కావున కులములు మానవ నిర్మితములు కావు. సృష్టితోడనే వచ్చినవన్న గ్రంథ కర్త వాదన సమర్థనీయము. శతపథ బ్రాహ్మణములో వివరించిన రీతిగా (5-5-4.9) వర్ణవ్యవస్థ ననుసరించి మానవులు తమ అవసరాలను తీర్చుకొనుటకు ఆయావృత్తులను చేపట్టిరి. ఇలాంటి వర్ణవ్యవస్థ అన్నిటి లోను ఉన్నదని శతపథ బ్రాహ్మణము చెప్పుచున్నది. వివరములు అర్ష

విజ్ఞాన సర్వస్వము ద్వితీయ సంపుటము తిరుపతి, తిరుమల దేవస్థానముల ప్రచురణ 1985 పేజి 48-53లో పొందుపరచబడి యున్నవి.

సమానభావమనునది ఈనాటికంటే వేదకాలమందే ఎక్కువగా ఆసింపబడునట్లు తెలియుచున్నది.

1. మన అందరి కోరికలు ఒకటిగా యుండవలెను.
2. మనలో హృదయపరివర్తన కలిగి అందరము ఏకము కావలెను.
3. మన ఆలోచనలన్నింటిలో సమభావము స్పష్టముగా ప్రతిబింబించవలెను
4. మనమధ్య మంచి స్నేహము వర్ధిల్లవలెను (ఋగ్వేదము 10వ మండలము - 191 సూక్తము - 4వ మంత్రము - ఆర్షవిజ్ఞాన సర్వస్వము ప్రథమ సంపుటము - 1985 పేజి 129)

వాల్మీకి విరచిత శ్రీమద్రామాయణములో ఈ విధముగా యున్నది.

రాజవంశాన్ శతగుణాన్, స్థాపయిష్యతి రాఘవ
చాతుర్వర్ణ్యంచ లోకేస్మిన్, స్వేస్వే ధర్మే నియోక్ష్యసి ॥

(బాలకాండము, ప్రథమసర్గ, ఫలశ్రుతి 96వశ్లోకము (సంక్షేప రామాయణము)

శ్రీరాముడు నూరింతలుగా రాజవంశములను స్థాపించగలడు. ఈ లోకములో నాలుగు వర్ణముల వారికిన్ని తమతమ ధర్మముల యందు ప్రవర్తింప జేయును

లోక విదితమయిన ఈశ్లోకమును గమనింపుడు.

"చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః ।
తస్య కర్తారమపి మాం విద్ధ్య కర్తార మవ్యయమ్ ॥

(భగవద్గీత 4వఅధ్యాయము 13వ శ్లోకము)

గుణాలను కర్తలకు తగినట్లు మానవులను నాలుగు విధములుగా విడదీసి సృష్టించి యున్నాను. నేను దేనిని స్వయముగా చేయకపోయినా మార్పులేని స్థితిలో యున్నవాడినైనా ఆ విభేదాలను కల్పించినవాడను నేనే అని తెలుసుకో (కృష్ణార్జున సంవాదము). శ్రీకృష్ణ పరమాత్మ అధీనంలోనే ఆయన సంకల్పము ప్రకృతిగా మనకు కనబడుచున్నది. (భగవద్గీత 9వ అధ్యాయము 5 నుంచి 10 శ్లోకములు - వ్యాఖ్యానమును చూడుడు).

భగవన్మతమును వైదికమతము, సనాతన ధర్మము అనికూడ పిలిచెదరు. ఇది జీవుల అస్తిత్వమునకు శాశ్వత వ్యాప్తృతి. మతము నమ్మకము పై ఆధార పడినది. నమ్మకము మార్పు చెందవచ్చును. కాని సనాతన ధర్మమునకు అద్యంతములు లేవు. మార్పుకు ఆస్కారము లేదు. ఇదియే శ్రీమద్రామానుజుల సిద్ధాంతము. హిందు, ఇస్లాము, క్రైస్తవ, బౌద్ధ మతములు సనాతన ధర్మము కానేరవు. ఆత్మ పరమాత్మల సంసర్గమే సనాతన సాంప్రదాయమునకు నాంది, లోప రహిత మానవ జీవితమునకు పునాది. వేదప్రతిపాదితమైన సనాతన ధర్మమునకు ధర్మ, అర్ధ, కామ, మోక్షములు మూలభూతములు. అర్ధ, కామములు ప్రాపంచిక సుఖములను, ధర్మము ఆధ్యాత్మిక చింతనను, మోక్షము జన్మరాహిత్యమును ఇచ్చును. ఈ తత్త్వ బోధను సులభతరమగునట్లు స్మృతేతి హాసములలో పురాణములలో మహర్షులు పొందుపఱచిరి భగవద్గీత చతుర్ధాధ్యా యములో శ్రీకృష్ణభగవానుడు ఈసనాతన ధర్మమును వైవస్వతునకు చెప్పినట్లు అతని నుండి మనువునకు, తదుపరి ఇక్ష్వాకునకు పరంపరగా వ్యాపించినట్లు వివరింపబడినది కావున దీనిని భగవన్మతమనుటలో సందేహము లేదు. హిందూమత మనునది ప్రత్యేకముగా లేదు మనము ఆచరించుచున్నది వేదప్రతి పాదితమైన సనాతన ధర్మము (సంప్రదాయము) (Bhagavadgita as it

is Bhaktivedanta Book Trust - Introductory part) గ్రంధకర్త భగవన్మత స్వరూపమును ప్రవృత్తి, నివృత్తి మార్గముల రూపముతో ప్రసాదించిరి. విజ్ఞులకు, సామాన్యులకు అవగతమగు రీతిలో హిందూమత (సనాతన ధర్మ) తత్త్వమును వివరించిన గ్రంధకర్త అభినందనీయులు.

ఈ గ్రంధములో పాత్రలు వాస్తవములు. భార్య శ్రీమతి శాయమ్మ గారు 1994లో పరమపదించిరి. కుమారుడు శ్రీరామదేవశర్మ బాపట్లలో, కుమార్తె శ్రీమతి బొమ్మరాజు ఇందిర హైద్రాబాదులో నివాసమేర్పరచు కొనిరి. అంతేవాసిని లేక శిష్యురాలు. సంభాషణలు కల్పితములు.



శ్రీమతే రామానుజాయ నమః

శ్రీవరదాభయ కోదండరామ! నీపాదముల నాశ్రయించి యున్న నన్ను నీ పనికై యంతర్యామి ప్రేరణముగావించితివి. భవదీయాజ్ఞపై జీవితావశేష మీకార్యము కొనసాగించుకొన దలచితివో - నీకు నమోవాకములు.

నీ సంకల్ప మమోఘము

అది మార్గశిరమాసము. ఆనాడు ఏకాదశి. అది శ్రీకృష్ణభగవానుడు భగవద్గీతను అర్జునునకు బోధించిన దినము. కావున గీతాజయంతియని దానిని పిలుచుదురు. ప్రొద్దుననే లేచి కాలకృత్యములు దీర్చుకొని దేవతార్చనము చేసికొని భగవద్గీతలోని పదునెనిమిది యధ్యాయములు పారాయణచేసి పిమ్మట మాధ్యాహ్నిక కృత్యములు తీర్చికొని ఫలహారము చేసి తీరికగా కూర్చుండి బిడ్డలను, భార్యను మిగిలిన గృహములోని వారినందరను చుట్టు కూర్చుండబెట్టుకొని వారికి ఆధ్యాత్మ విషయము చెప్ప దలంచితిని.

నేను : చూచినారా ! యీ దినము చాల పవిత్రమయినది. వంటలు, భోజనములు పని లేదుగాబట్టి మనయందఱకు తీరిక చిక్కినది. చక్కగా మీరు వినుడు. నేను మంచి విషయములు చెప్పెదను.

కూతురు . నాయనగారు మనమీరోజు ఉపవాసము చేయవలయునా! బాగుగా తిని యాకలిబాధ లేకుండ చేసికొని మంచి విషయములు వినగూడదా !

నేను : అమ్మ ! ఉపవాసమేల చేయవలెను అను విషయము మిక్కిలి గొప్పది. దానిని గురించి మీకు జెప్పెదను. పెద్ద

పెద్ద విషయములు నేర్చుకొనుటకు ముందు చిన్న చిన్న సంగతులు నేర్చికొనుట మంచిది. విశ్వాసము కుదుర్చు కొన్న తరువాత పెద్దపెద్ద సంగతులు తెలిసికోవచ్చును. అప్పుడు బుద్ధికి బాగా విషయములంటును. పెద్దపెద్ద విషయములు తెలిసికొనుటకు బుద్ధి కూడ పెద్ద పెద్దదిగా అగుచుండవలెను. నీవు పెద్ద పెద్ద పుస్తకములు మొదటలో చదువగలిగితివా. చిన్న చిన్న మాటలు, వాక్యాలు, తరువాత చిన్న కథలు చదివి నీ బుద్ధిని పెంపుచేసికొని యిప్పుడు భారతము చదువుచున్నావు. అట్లే యీ విషయములు. మన పెద్దలు చాలకాలము నుండి ముఖ్యములైన దినములలో ఉపవాసము చేయవలెనని యన్నారు. మనకంటె మన పెద్దలు చాల తెలివిగలవారు, గొప్ప వారు. కావున వారు చెప్పినట్లు మనము చేయుచున్నాము. పెద్దలు చెప్పిన దానిని చేసిన దానిని మనము చేయుదము. ఈ క్రింది శ్లోకమును గమనింపుడు.

| | |
|---|---|
| సర్వాగమా నా మాచారం | అన్ని శాస్త్రముల యందు ఆచారమే |
| ప్రథమం పరికల్పితః | (పెద్దలు ఆచరించినది) ప్రథమముగా పేర్కొన |
| ఆచార ప్రభవోధర్మః | బడినది. ఆచారము నుండి ధర్మము పుట్టినది. ధర్మ |
| ధర్మస్య ప్రభురచ్యుతః | మునకు ప్రభువు శ్రీ మహావిష్ణువు. |

ఇంత మాత్రము విశ్వాసము మనకు ముందు కలుగవలయును.

భార్య · అయితే ఈ ఉపవాసాలు మనకే యున్నవా ? లోకములో నందఱకు నున్నవా !

నేను మంచిమాట. అటులనడుగు. ఎందుకున్నవి! అని ప్రశ్నించుట కంటె నిట్లడుగుట మంచిది మన మహమ్మదీయ సోదరులు రంజాన్ నెలలో ఉపవాసవములు చేయుట వినలేదా ! చూడలేదా! మన క్రైస్తవ సోదరులు

పవిత్ర శుక్రవారము (Good Friday) నాడు ఉపవాసవము చేయుట గమనించలేదా !

కుమార్తె : మనకు మహమ్మదీయులు, క్రైస్తవులు సోదరులా ! (నవ్వును అందరు నవ్వుదురు)

కుమారుడు నాన్న తమాషాగా మాట్లాడును లేవే చెల్లి !

నేను : ఏమిర నాయన తమాషాగా మాట్లాడుచున్నానా ! నిజముగా ముస్లిములు, క్రైస్తవులు మనసోదరులే.

కుమారుడు : మిగిలినవారో - బౌద్ధులు, జైనులు.

నేను వారు మన సోదరులే. అవును అందఱు సోదరులే. ప్రపంచములో నున్న మనుష్యులందఱు మన సోదరులే ఏమమ్మా! నీవు సందేహించుచున్నావు.

అంతేవాసిని : నాయనగారు మహమ్మదీయులది ఇస్లాము మతము. వారి దుస్తులు వేరు. వారి యాచారములు వేరు. వారి మతము వేరు. ఏవిధముగా వారికి మనకు పోలికేలేదు. క్రైస్తవుల మతము వేరు. వారి ప్రార్థనలు వేరు. వారి నమ్మకములు వేరు. వారి యాచారములు వేరు. బౌద్ధులు, జైనులు, వారు వేరు వేరు మతములు, ఆచారములు గలవారు. అయితే బౌద్ధులు, జైనులు మనకు దగ్గరలో గానవచ్చుట లేదు.

నేను : అవునమ్మా నీవు చదువుకున్నదానవు. కొంచెము లోతుకు దిగి మతములు, ఆచారములు, ప్రార్థనలు అని కొన్ని కొన్ని విషయము లెత్తినావు. మంచిది ఈ ప్రపంచములో నున్న మానవులందఱును ఈ భూదేవి యొక్కతయే భరించు చున్నది. ఈ ఆకాశమొక్కటియే కప్పి యున్నది. ఈ సూర్యు

డొక్కడే యెల్లరకు జీవశక్తి, వెలుతురు నిచ్చుచున్నాడు. ఈ చంద్రుడే వెన్నెల యిచ్చుచున్నాడు. ఈ నక్షత్రములే ఆకాశములో నుండి మినుకు మినుకుమనుచు మనము చేయు పనులను తొంగి తొంగి చూచుచున్నవి. మన మందఱము ఏకవిధముగానే పుట్టుచున్నాము, పెరుగు చున్నాము, మరణించుచున్నాము. మానవులందఱము ఒకే విధముగా యున్నాము. మానవుడొక్కడు గుహలో సింహము లాగా యెంటరిగా యుండలేదు. ఒక మనుష్యునకు మరియొక మనుష్యుని సహాయము కావలెను. మన మియింటిలో యున్నారము. ఈ యింటిని గట్టుటకు మనకు నెవరెవరుపయోగ పడిరో తెలియునా ! అందాకయెందుకు. మనకుటుంబములో అందఱు అన్నిపనులు చేసికొనకపోయిన మనము వేళకు తిండి తినగలమా, బ్రతుకగలమా ! మనము పదిమందిగల యొక కుటుంబము. మన గ్రామము పెద్ద కుటుంబము. మనదేశము అంతకన్న పెద్ద కుటుంబము. ప్రపంచము మఱి పెద్ద కుటుంబము. మనము మన పొరుగింటివారు ఎన్ని సమయములలో నెట్లు సహాయము చేసికొను చున్నాము. అట్లే మన గ్రామమువారు మఱియొక గ్రామము వారు సహాయము చేసికొనవలయును. మనదేశము మఱియొక దేశము ఇట్లే పరస్పరము సహాయము చేసికొనవలెను. ఏ యొకరు తొలగి యుండలేరు. అట్లుండుట మానవ స్వభావము కాదు. ఒకరిపై నొకరు మైత్రి ప్రేమలున్నప్పుడే కదా యొకరి కొకరు సహాయ పడుట. కావున ఈ విశ్వమానవ కుటుంబములోని మానవు లందఱు సమాన భాగస్వాములు. అన్నదమ్ములు అయితే వారు తెల్లవారు, మనము నల్లవారము, వారు

ముస్లిములు, మనము హిందువులము. ఆచారములు భేదము. అభ్యాసములు భేదము. నాగరికత భేదము సంస్కృతి భేదము. క్రైస్తవులకు, బౌద్ధులకు, జైనులకు ఇటులనే అన్వయించుకొనవచ్చును. మనకెట్లు సోదరత్వము కుదురుననియా నీయభిప్రాయము. మనమొక యింటిలో నున్నారము. మీ చెల్లెలికి నింపైన చీర నీకు గాదు. నీవు తెల్లచీర గట్టుదువు. నీ చెల్లి గులాబి చీర కావలయుననును. నీకు రుచించిన కూర నీ తమ్మునకు రుచింపదు. నీవు పచ్చని దానవు. నీ బిడ్డ నల్లనివాడు. ఈ భేదములను నీవు పరిగణించు చున్నావా! ఈ భేదములను విడిచి ప్రేమతో మైత్రితో నుండుట లేదా. అట్లే ఈ విశాల ప్రపంచములో దేశమునుబట్టి, శీతోష్ణస్థితిని బట్టి, విజ్ఞానమును బట్టి, యనేక తారతమ్యములుండును. ఆతారతమ్యములను మనము పెద్దగా తలంచి యొక మానవుని కంటె మఱియొక మానవుడు వేఱని తలవరాదు. ఈ సర్వ భూమండలమును ఈ కనబడుచున్న యాకాశ మండలమును, ఈ భూమిపైగల చరాచరజీవ కోటిని ఈ ఆకాశమునందు గల జ్యోతిర్మండలములను సృష్టించిన వాడొక్క భగవంతుడే. మనకొక భగవంతుడు, ముస్లిముల కొక భగవంతుడు, క్రైస్తవుల కొక భగవంతుడు లేడు. సర్వ ప్రపంచమును సృష్టించినవాడు, పెంచినవాడు, సమయమునుబట్టి త్రుంచువాడు, సమస్త జగములలో నిండియున్నవాడు ఒక్క భగవంతుడే. ఒక్క భగవంతునిచే సృజింప బడి, పెంచబడి, రక్షింపబడుచున్న మనమెల్లరము అన్నదమ్ములము కామా. ఒక తండ్రిబిడ్డలన్నదమ్ములయి నట్లే యొక భగవంతుని బిడ్డలన్నదమ్ములు.

కం ॥ హరిమయము విశ్వమంతయు
హరి విశ్వమయుండు సంశయము పని లేదా

హరిమయము గాని వస్తువు
పరమాణువులేదు వంశపావన వింటే

ఈజగత్తు నందంతయు హరి నిండి యున్నాడు. అన్నిలోకాలు హరి యుదరము నందున్నవి. శ్రీహరిచే సృజింపబడని, శ్రీహరిచే వ్యాపింపబడని పరమాణువు లేదు నీయందున్న భగవంతుడే నాయందున్నవాడు మహమ్మదీ యునందున్నవాడు, క్రైస్తవునందున్న వాడు. చరాచర భూతకోటి యందున్నవాడు నీవే వస్తువు జూచినను నీయందున్న పరమాత్మయే నీకు గాన వచ్చుచున్నాడు. అట్టిచో నెవరినేని నీవు వేఱుగా భావింపగలవా ! భావింపలేవు. కావున మతమును బట్టి యాచారమును బట్టి వేషమును బట్టి భాషను బట్టి యే మానవుని వేఱుగా దలంపరాదు. ఆ మానవుని యందున్న బరమాత్మను జూచి యాతడు నీవంటి వాడే నీకు సోదరుడని భావింపవలెను. ఒక్క మానవు లనయేమి. సమస్త ప్రాణి కోటులను, పిపీలికాది సింహపర్యంతము గల మృగములను, పక్షులను గూడ నీవు వేఱుగా దలంచుటకు వీలులేదు. లోకమునందంతట భగవంతుడు నిండి యున్నాడు అనినప్పుడు పామునందు లేడు, తేలునందు లేదనియా యర్థము. ఆత్మవత్సర్వభూతాని యః పశ్యతి స పండితః. తనవలె సర్వభూతము లను దలంచు వాడే జ్ఞాని ప్రహ్లాద చరిత్ర విన్నారు గదా. ప్రహ్లాదు డే భావముచే నుండెను. అతడు సర్వమునందీశ్వరుడు గలడని తలచి తన్ను జంపవచ్చిన రాక్షసుల యందు, వారి చేతి యందుగల యాయుధ ముల యందు, ద్రొక్కవచ్చిన యేనుగులందు, త్రాగ వచ్చిన విషము నందు భగవత్స్వరూపమును జూచినాడు. కావుననే యాతడు జయము పొందగలిగెను. ఇదియే మన హిందూ మత సారము. ఈజ్ఞానమే పర మార్థము. కాబట్టి సాంఘిక దృష్టితో జూచినను, ఆధ్యాత్మిక దృష్టితో జూచినను మానవులెల్లరు సోదరులే. ఇట్లు తలంచుటయే హిందూ మతము. ఇప్పుడు చెప్పుడు. సోదరులులేని మానవులున్నారా!

కుమారి : లేరు, నాయనగారు, నిజముగా లేరు.

అంతేవాసిని · కాని నాయనగారు మతమనిన ఏమిటి ? మనది హిందూ మత మంటిరి. ఆపేరేట్లువచ్చెను ? ఎప్పటి నుండి వచ్చెను మన మత మెప్పుడేర్పడినది ? మొదలగు విషయములను గుఱించి తెలుప వలెనని ప్రార్ధన.

నేను తల్లి చక్కగా నడిగితివి తెలిసికొనవిషయము సంపూర్ణ ముగా జెప్పుదును. మీరందరు వినుడు. మతమనునది సంస్కృత పదము. మన్ అను సంస్కృత ధాతువునకు నిశ్చయించు, తలచు, ధ్యానించు, గౌరవించు, భావించు మొదలగు నర్ధములు కలవు. కావుననే మతము అను మాటకు నిశ్చితము, ధ్యానము, భావము, అభిప్రాయము, సమ్మతము, మొదలగు నర్ధములు గలిగినవి ఇది నా మతము. అనగా ఇది నాకు సమ్మతమైనది. ఇష్టమయినది. ఇది నా నిశ్చయాభిప్రాయము అనునర్ధము. నీకు సమ్మత మైనది నీమతము. నాకు సమ్మతమయినది నామతము. ఇట్లుండగా నీ మతమనుమాట యిప్పుడొక మానవసంఘ మవలంబించు నాచార వ్యవహారములకు, ఆసంఘము నకు గల నాధ్యాత్మిక భావమునకు మతమని పేరగు చున్నది. బుద్ధుడనొక మహాపురుషుడు తనకే మార్గము అభీష్టమైనదని చెప్పెనో యది బౌద్ధమతమన బడినది. ఆ మతము సమ్మతించినవారు బౌద్ధులైరి. మహావీరుడగు జినునకు సమ్మతమైన మార్గము జైనమతమైనది. ఏసు క్రీస్తున కభీష్టమగు మార్గము క్రీస్తుమతమైనది. మహమ్మదు నకు నభీష్టమైన మార్గము మహమ్మదీయమత (ఇస్లాము మతము) మైనది. నేటికి దాదాపు 2500 సంవత్సరముల క్రింద (ప్రస్తుత కాలమానము 2546 సం.) పుట్టినది బౌద్ధమతము నేటికి 1956 (2002 సం.) సంవత్సరముల క్రింద పుట్టినది క్రీస్తుమతము. నేటికి 1377 (1423 సం.)

సంవత్సరముల క్రింద పుట్టినది ఇస్లాము మతము జైన మతము బౌద్ధమతము కంటె 17 సంవత్సరములు ముందు పుట్టినది. బుద్ధుడు, మహావీరుడు, ఏసుక్రీస్తు, మహమ్మదు మొదలగు వారు ప్రవక్తలు. వారి నిశ్చయాభిప్రాయములు వారివారి మతములైనవి.

సుతుడు నాయనగారు హిందువు అనువానికి సమ్మతమైనది హిందుమత మందురా ! ఇదెప్పుడు కలిగెనందురు.

తండ్రి : కుమారా ! వినుము. హిందువనునది బుద్ధ, క్రీస్తు, మహమ్మదుల వలె, నొక మానవ వ్యక్తికి గల సంజ్ఞా వాచకము గాదు. హిందువు అను పేరు మన భారత, రామాయణ, భాగవత, విష్ణుపురాణముల యందు గన బడదు. మనదేశమునకు భరతఖండమనియు, భరత వర్ష మనియు పేర్లు మనపురాణేతి హాసములందు సుప్ర సిద్ధములు. భరతఖండమనుపేరు దౌష్యంతి భరతునుండి వచ్చినదని యందురు. సప్తద్వీపములుగా విభజింపబడిన భూమండలము (జంబు, ప్లక్ష, కుశ, క్రౌంచ, శాక, శాల్మలి, పుష్కరం) లో మనది జంబూ ద్వీపము. జంబూద్వీపములో భరతవర్షము. భరత వర్షములో విశేషించి మనది భారత ఖండము. ఇట్టి భారత ఖండ వాసులము మనము భారతీయులము. ఇట్టి భారత ఖండమునకు నితరులగు వారలితర దేశముల నుండి వచ్చి మన సింధూనదిని హింధుయని యుచ్చరించి తత్తీరవాసులను హిందువులని మొదట బిలిచిరనియు తరువాత మన భరత ఖండము లోని యెల్లరును హిందువులనిరనియు చరిత్రకారులు చెప్పుచున్నారు మరికొందఱు మరియొక విధముగా జెప్పుదురు. ఎవరెట్లు చెప్పినను నిది యిటీవల మన

దేశమునకు, దేశమును బట్టి మనకు వచ్చిన పేరేగాని మన ప్రాచీన గ్రంథములగు, మన స్మృతులలో ధర్మశాస్త్రము లలో, పురాణేతి హాసములలో మనకు గలిగిన పేరు కాదు. జైన, బౌద్ధ, క్రైస్తవ, మహమ్మదీయాది మతము లేర్పడిన కొలది మనలను మనమతమును వారి మతముల కంటె వేఱుచేసి చెప్పుటకై యితరులు మనలను హిందువులని మనది హిందూ మతమని పిలువజొచ్చిరి. ఇప్పటికి మనము వారి కంటె వేరయిన వారమని చెప్పుకొనుటకు మనము ఆపేరును అంగీకరింప వలసి వచ్చినది ప్రస్తుత వ్యవహారమట్లే సలుపుదము.

అంతేవాసిని : నాయనగారు మొన్న మన స్కూలులో ఒక మిస్సమ్మ అడిగినది కదా ! బౌద్ధమతమునకు బ్రవక్త బుద్ధుడు, క్రైస్తవ మతమునకు బ్రవక్త క్రీస్తు, మహమ్మదీయ మతమునకు బ్రవక్త మహమ్మదు. మీ మతమునకు బ్రవక్త యెవరు ? ప్రవక్త లేనిది మతమే కాదని యాక్షేపించినది. మన మతమునకు బ్రవక్త యెవరు ? మనమత మెప్పటి నుండి యున్నది !

తండ్రి : బిడ్డలారా ! మీరు గమనింపవలసిన విషయము చాల గలదు. బుద్ధుడు పుట్టుక మునుపు బౌద్ధమత మున్నదా! లేదు. బుద్ధునకు ముందు బౌద్ధ వాఙ్మయముండి బౌద్ధులు, బౌద్ధ సిద్ధాంతము లున్నచో సిద్ధార్థుడు రాజ్య పరిత్యాగము చేసి బుద్ధుడై బౌద్ధ మతమును సృజించెననుట చెల్లనేరదు. ఏసుక్రీస్తు పుట్టక పూర్వము క్రైస్తవ మతము లేదు. ఉన్నచో వారు ప్రవక్తలు కాజాలరు. ఇస్లాము కంటె ప్రాచీనమయినది క్రైస్తవమతము. క్రైస్తవమతము కంటె ప్రాచీనమయినది బౌద్ధమతము బౌద్ధ మతము కంటె ప్రాచీనమయినది హిందూమతము. బౌద్ధ మతము దండెత్తినది మన హిందూ మతము మీదనే కదా.

కాబట్టి మనమత చరిత్ర నెఱుగుటకు బౌద్ధమతమునకు బూర్వస్థితికి బోవలయును. ఈకనబడుచున్న ఆకాశము పుట్టియెన్నాళ్లయినదందురు? ఈ సముద్రములు పుట్టి యెన్నాళ్లయినదందురు ? ఈ సూర్యుడు, నక్షత్రములు పుట్టి యెన్నాళ్లయినదందురు. మన హిమాలయ పర్వతములు పుట్టి యెన్నాళ్లయినదందురు ? శాస్త్రజ్ఞులు గణన చేసి యేదో లెక్కయిచ్చును. ఎంత తక్కువ లెక్క యిచ్చినను బౌద్ధమతము కంటె పూర్వమునకు బోవును కాని యిటీవలకు రాదు గదా.

కాలము మితిలేనిది. కాలమునకు మొదలు లేదు. చివర లేదు. అట్టి కాలము సూర్యాస్తమయ, సూర్యోదయాదులచే కొలవబడు చున్నది. ఒకప్పుడు సూర్యోదయ, సూర్యాస్త మయాదులు కనబడక పోవచ్చును. అంత మాత్రముననే కాలము లేకపోలేదు. అంత దూర మెందుకు? ఆకాశము విషయము చూడుము. ఆకాశమునకు మొదలు, తుది నిర్ణయింపగలమా! ఈయాకాశములో మనకు గనబడు చున్న నక్షత్రమండలము గ్రహమండలమే కాని యంత కంటెలేదని చెప్పగలమా! చుట్టూ గోడలు గల మధ్య ప్రదేశమునకు బరిమితి యుండును. అట్టిది కాదు గదా! ఆకాశము. ఇట్టియనంతమైన యాకాశములో లెక్కపెట్ట లేనన్ని బ్రహ్మాండములున్నవని కదా మన పెద్దలు చెప్పి యున్నారు ఇట్టి బ్రహ్మాండములకు సృష్టి, స్థితి, ప్రళయము లుండును. ఈబ్రహ్మాండమెప్పుడారంభ మైనది యని విచారింపలేము. సృష్టి, స్థితి, లయములు మూడు నొకటి వెంట నొకటి వచ్చుచునే యుండును. సృష్టి ప్రవాహిక నదికాని ముక్తిపొందిన జీవులు ముక్తి నొందు చుండగా నజ్ఞాతములో నున్న జీవులు సృష్టి ప్రవాహిక లోనికి వచ్చు చుందురు. భగవంతునితో నుండునవి ఈసృష్టి, స్థితి,

లయములు. సృష్టి, స్థితి, లయము లేని కాలము మూసి వేసిన దుకాణము వంటిది. దుకాణదారుడు సరుకు లన్నియు పగలు వెలుపలబెట్టి యమ్ము చుండును రాత్రి గలిగిన వెంటనే లోపల నుంచును. మరల యుదయమున వెలుపలకు దెచ్చియుంచును. అట్టిదియే సృష్టికర్త వ్యాపారము. ప్రాతసరుకులయిన వెంటనే క్రొత్త సరుకుల నంగటిలోనికి దెచ్చు దుకాణా దారువలె భగవంతుడును ముక్తులగు జీవులు ముక్తులగు చుండ నజ్ఞాత స్థితిలో యున్న జీవులను సృష్టియంగడి లోనికి దెచ్చును. ఈ వ్యాపారము భగవంతునకభి మతమైనది.

అనగా నిది భగవంతుని మతమన్నమాట. అట్టి భగవంతున కధీనమయిన భగవంతుని మతములో జిక్కి భగవదధీనుల మయిన మనకు భగవంతుని మతమే మతము. కావున మనది భగవన్మతము. ఈ మతము భగవంతునితో నారంభ మయినది. ఇప్పటికెన్ని పర్యాయములో సృష్టి, స్థితి, లయములు జరిగినవి. ఇకనెన్ని పర్యాయములో జరుగను. పోయినవి లెక్కకందవు, వర్తమానములో నున్నవి లెక్క కందవు. ఇప్పుడు మన మతమెప్పుడు పుట్టినదని యడుగు వారలకేమి చెప్పగలము ? బావిలో నున్న కప్పవద్ద కొకనాడెట్లో సముద్రములోని కప్పవచ్చినదట. అప్పుడు బావిలోని కప్ప అయ్యా ! నమస్తే తమరెక్కడ నుండి వచ్చిరి అని అడిగెను. సముద్రపు కప్ప నేను సముద్రము నుండి వచ్చితిననెను. మీ సముద్రము ఇంత పెద్దదిగా యుండు నాయని యొక గంతు వేసి యడిగి నదట. కాదని సముద్రపు కప్ప చెప్పినది. మఱింత పెద్దది యాయని బావి కప్ప మఱింత యూపుతో గంతువేసి యడిగినది. కాదని సముద్రపుకప్ప నిరసించినది. ఇట్లు తన శక్తి కొలది విసుగు పుట్టినదాక గంతులువేసి బావికప్ప చివరకు విసుగెత్తి ఛ

యింతకంటె జగత్తులేదు ఈబావి కంటె పెద్దది యింకెక్కడి నుండి వచ్చును. ఈ బావిపైదే యాకాశము. ఇదే బ్రహ్మాండము. పోపొమ్మని తిరస్కరించి నదట. అట్లున్నది చరిత్ర నందు కొన్ని వందలు వేలు మాత్రము జీవితము గల మతముల వారు మన మతము పుట్టుపూర్వోత్తరముల నడుగుటయట్టిది.

కుమారుడు ఈసృష్టి యారంభమై యెంతకాలమయినది ?

తండ్రి : నాయనా చెప్పెదవినుము. ఈవర్తమాన సృష్టియారంభమై 15552195 కోట్ల 58లక్షల 85వేల 57సంవత్సరములైనది. (ప్రస్తుత మునకు 46 సం. కలుపవలెను). ఇంతకాలములో నేటికి 2500 (ప్రస్తుతము 2546) సంవత్సరముల క్రిందట పుట్టినది బౌద్ధమతము. అనగా భారత కాలములో ద్వాపరయుగము గడచి కలియుగము వచ్చినది కలి యుగము వచ్చిన తరువాత 2557సం లకు బౌద్ధమతము జనించినదనుమాట. తరువాత నేటికి 1957 (2002) సంవత్సరముల క్రింద క్రైస్తవమతము జనించినది. క్రైస్తవ మతము పుట్టిన 600 సం.లకు మహమ్మదీయ మతము జనించినది. మనమతముకు భగవంతుడే స్వయముగా ప్రవక్త. భగవంతుడు ప్రజలను సృష్టించి ప్రజలకు దన్నారాధించు మార్గము దెలిపినాడు. మనము భగవంతుని మతము వారమని చెప్పుటలో విపరీతమేమున్నది. కావుననే హిందూ మతమని మనమతమును ఇతరులు పేరుపెట్టి పిలుచువఱకు మనము మన మతమునకిది పేరని యే వ్యక్తి పేరుతోడను జెప్పజాలము.

అంతేవాసిని . నాయనగారు, మీరు చెప్పునది దురవగాహము. భగవంతడు ప్రజలను సృష్టించి ప్రజలతో దనయారాధన మార్గమునంతను దెలిపెనందురా !

తండ్రి    అవును తెలిపెను. అట్లు తెలుపబడినవారు మహర్షులు తెలుపబడినది వేదములు. మనవారు కొందఱు వేదములు బుద్ధిమంతులగు మానవులు వ్రాసిపెట్టిరని యపవాదము లు సేయు చుందురు బుద్ధుడు-దేవుడు గలడు, అతడు రక్షకుడు. జీవుడు రక్షింపబడువాడు అను తలంపు లేనివాడు. అతడు స్వయముగా దుఃఖ నివారణోపాయ మును గనిపెట్టదలంచి కృషిచేసి కనిపెట్టినాడు. అందు వలననే అతడు బుద్ధుడు. అతని మతము బౌద్ధమత మగుట కలిగినది. ఏసుక్రీస్తు అక్షత యోనియగు కన్యకు కలిగినాడు. అతడు జ్ఞానియై తాను భగవంతుని దూతనని చెప్పుకొని తాను చెప్పుమాట లెల్లను భగవంతుని వాక్యము లని ప్రబోధించినాడు. వాని యనుచరులే యట్లునమ్మి నారు, నమ్ముచున్నారు. వారి మత గ్రంధమగు బైబిలు దేవవాక్యమని చెప్పుచున్నారు. మహమ్మదు తాను దేవ దూతనని గాని, దేవుని బిడ్డననికాని చెప్పుకొనలేదు. కాని దైవము తనయందావేశించి పలికించుచున్నాడనియు తనవి దేవుని వచనములనియు చెప్పియున్నాడు. అతని యనుయాయులట్లే నమ్ముచున్నారు. ఇట్టి స్థితిలో సృష్ట్యాదిలో భగవంతుని నిశ్వాసములుగా వెడలి బ్రహ్మ వలన గ్రహింపబడి మునీంద్రులకు బ్రసాదింపబడిన వేదములు మానవ నిర్మితములని చెప్పువారినేమన వలెను? వారి విమర్శలకు నేమి విలువ ఈయవలెను. మహమ్మదు కాని క్రీస్తు కాని యివి నావచనములు. నా సిద్ధాంతములని చెప్పి దైవము పేరెత్తకపోయినచో నెవరు మన్నింతురు ? ఒకరిద్దఱంగీకరించినను వానికి విలువయు, లోకములో వ్యాప్తియు యుండునా! బుద్ధుడు నా తెలివిచే గనిబెట్ట బడినిది యీ మార్గము అని చెప్పె గదా! ఆయనకెట్లు అనుచరులు గలిగిరి? అని ప్రశ్నింతువా! బుద్ధుడుండి నప్పటికంటె ఆయన వెళ్లి పోయిన తరువాత పెక్కు సంవత్సరములకే యా మతము వ్యాపించినది

అదియును బౌద్ధమతస్థులు బుద్ధుని దేవునిగా ఆరాధింప మొదలుపెట్టి ప్రచారము చేయుట నారంభించిన తరువాతనే ప్రజానీకములో బౌద్ధ మతము వ్యాపించినది. బుద్ధుడు చేసిన ధర్మ చక్ర ప్రవర్తనము వేరు తరువాత వ్యాప్తి చెందిన బౌద్ధమతము వేరు సన్యాసము ప్రధానముగా బుద్ధుడు బోధించినాడు బౌద్ధుడు సన్యాసియు భిక్షువునై మఠవాసము చేయవలెననగా నయ్యది మాఱి గృహస్థులై యిండ్లలో ప్రకృతి వ్యాపారములు జరుపుచు బౌద్ధులుగా నుండు బౌద్ధమత మేర్పడినది. భార్యాపుత్రులను, ఆస్థులను విడిచి కేవల వైరాగ్యమును, అహింసావ్రతమును బూని భిక్షువులుగా సంచరింప వలసినది పోయి భార్యాపుత్రులతో రాగద్వేషాలలో యధేచ్ఛ స్వార్థానుభూతులతో నుండి పోవుటకు బౌద్ధమతమంగీక రించినది ఇక వైదిక కర్మల బెడద తగ్గినది. కావున బౌద్ధమతమొక తీరుగా వ్యాప్తి చెందగలిగినది మఱియు నింకొక చిత్రము. బుద్ధునికి విగ్రహారాధన యేర్పఱచి బుద్ధునికి పూర్వ జన్మాదులను గలిగించి మహత్తుల నేర్పఱచి పెద్ద వాఙ్మయమును బుట్టించి మత వ్యాప్తికి సాధనముగా - క్రైస్తవ మిషనరీలు విద్యాకళల పోషణము చేసినట్లుగా - బౌద్ధులు బుద్ధుడు ప్రసాదించిన ప్రధాన సూత్రములకు దోసెడు నీళ్ళు వదలి నామరూపములు గల్పించుకొని ప్రజల నాకర్షించుటకై చిత్రచిత్రములకు శిల్పకళాసౌష్ఠవములగు యారామచైత్య విహారముల సృజించి విద్యావ్యాప్తికని విశ్వవిద్యాలయాలు సృజించి సామాన్య ప్రజలకుద్బోధకముగా జాతకకథలు వినిర్మించి బౌద్ధ వాఙ్మయములను బెంచి కౌపీన సంరక్షణార్థ మయం పటాటోపః అన్నట్లు చేసిరి. వైదిక కర్మల యంద నాదరణము గలిగినను దక్కిన విషయములలో భగవన్మత మొకదిక్కున బౌద్ధమతమును మ్రింగి వేయుటచే నామమాత్ర బౌద్ధము విజృంభించినది.

కుమారి : కౌపీన సంరక్షణార్ధ మయం పటాటోపః ! అనగా నేమిటి నాయన గారు ?

తండ్రి : అమ్మా ! వినుము. పూర్వము ఒక యడవిలో నొక ఋషి తపము చేసికొనుచుండెను. ఒకనాడొక బ్రాహ్మణుడు ఆదారిన పోవుచు నా ఋషిని సేవించి వెడలెను. మరల గొన్ని యేండ్ల కాబ్రాహ్మణు డాదారినే వచ్చెను. ఇప్పుడు మునపతడు చూచినచోట నొక పెద్ద ఇల్లు కలదు. ముందొక చావిడి గలదు. పశువులు జీతగాండ్రు పెద్ద రైతువలె నట్టహాసము గాన్పించుటచే నాబ్రాహ్మణుడు లోపలికి బోయి యాయజమానితో అయ్యా ! పూర్వమొక ఋషి యుండెడివాడు. ఇచట నిప్పుడాతడు గనబడ లేదేమి? యని ప్రశ్నించెను. దానికాతడు అయ్యా నేనే యాఋషిని. అప్పుడు నేను గోచి పెట్టుకొని యుండెడి వాడను. ఆగోచిని యొక మేకునకు దగిలించి యుండెడి వాడను. ఎలుకవచ్చి యాగోచిని కొట్టి వేయుట నారంభించి నది. ఎలుక బాధపడలేక యొక పిల్లిని బెంచితిని. పిల్లిని పెంచుటకు పాలుగావలె గదాయని యొక ఆవును సంపాదించితిని. ఆవునకు మేతవేసి పెంచుటకొక జీతగాడు కావలసివచ్చె. ఆ జీతగాడికి కూడు పెట్టుటకు నొక యాడుది కావలసివచ్చె. అందుకని పెండ్లియాడితిని. పెండ్లామునకు కూడు గావలెను గదా. అందుకని వ్యవ సాయము నారంభించితిని. ఇదియంతయు కౌపీన సంరక్షణార్ధమయం పటాటోపః గోచిని కాపాడుకొనుట కేర్పఱచికొనిన యాడంబరము కాని లేకపోయిన నాకేమి కావలసియున్నది అనెను. బ్రాహ్మణుడదివిని యాశ్చర్య పడుచు తనదారిన పోయెను.

అంతేవాసిని : నాయనగారు! భగవన్మతమనుపేరు మీరు గల్పించిరా ! ఎచటనైన నామాటగలదా !

తండ్రి తల్లి! మంచి ప్రశ్న వైచితివి. భగవన్నిశ్వాసములుగా వెడలినవి వేదములు. వేదములకు శృతులని పేరు శ్రుతల యర్థములను స్మరించి చెప్పబడినవి స్మృతులు స్మృతుల యర్థముల కుపబృం హణము లనగా వాని నుదాహరణ కథలతో తెలుపునవి ఇతిహాస పురాణములు. వేదములు, స్మృతులు, పురాణేతిహాసములు వీని యందలి యర్థ మొక్కటే ఇవన్నియు భగవన్మతమునే తెలుపును ఆయా యుగములలో మనుజులకందవలసిన ఆయువు, బలము, బుద్ధులు వేఱువేఱుగా నుండును. ప్రజా సామాన్యమునకు దెలియదగిన మహార్థములు నిగూఢము గా నుంచుట భగవంతుని యిష్టము కాదు కావున భగవంతునిచే బ్రేరేపింపబడి భగవత్తత్త్వము సులభముగా దెలియబడుటకై పురాణేతి హాసములు వ్రాయబడినవి. ఇది కలియుగము. అల్పాయుష్కు లము, స్వల్పబుద్ధులము, క్షణభంగులము. ఇట్టి మనకు నేటికి సమస్త వేదాంత వాఙ్మయములు సులభసాధ్యములైనవి. దశోపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత వీనిని ప్రస్థానత్రయ మందురు. ఆధ్యాత్మ విద్య తెలిసికొనుటకు నీ మూడింటిని యెఱుంగవలయును. చక్కని యుదాహరణ కథలతో నీ మూడింటిలోని తత్త్వమే శ్రీమద్రా మాయణము, మహా భారతము, శ్రీభాగవతము, విష్ణు పురాణము మొదలగు వానియందు దెలుపబడినది. వేదములతో మనకు పనిలేదు. వానిని దెలిసి కొనుట దురవగాహము. వేదాంతములగు నుపనిషత్తులు, బ్రహ్మ సూత్రములు దురవగాహములు కావచ్చును. సర్వమానవకోటికి నైహికాముష్మిక ఫలసిద్ధికై వెలసిన శ్రీమద్రామాయణ భారత భాగవత విష్ణుపురాణాదులు మనభగవన్మతమును జక్కగా దెలుపుచున్నవి. అంతయేల మీకు సూత్రప్రాయముగా జెప్పుచున్నాడను. మహాభారతాంతర్గతమైన భగవద్గీత సకల

వేద పురాణ శాస్త్రేతిహాసముల సారమగు శ్రీభగవన్మతము ఆధ్యాత్మికా మృతమిందులో నున్నది. ఇదివీరు, వారని నియమము లేక స్త్రీ పురుషులెల్లరు తెలిపికొనదగినది. మరొక గ్రంధాపేక్షలేకయే సర్వ మీ భగవద్గీతల వలన దెలిసికొనవచ్చును. ఈ మహాగ్రంధమునకు నింగ్లీషులో సుప్రసిద్ధములైనవి 18 భాషాంతరీకరణములు గలవు. ప్రపంచములో భగవద్గీతలు వెలయుని భాషలేదు. ఖండము లేదు. దేశము లేదు. సుప్రసిద్ధమైన మోక్షమార్గ మిందుగలదు. మీరన్నిటిని విడిచి యెవరైన మీమత గ్రంధమేదియనిన శ్రీభగవద్గీతయని యొక్క మాటలో జెప్ప వచ్చును. సర్వవేదశాస్త్ర పురాణేతిహాస సార మంతయు నేనుగునడుగులో నితర జంతువుల యడుగు వెళ్లి నిమిడి యున్నటుల నిమిడియున్నది. శ్రీభగవద్గీతలకు ప్రవక్త శ్రీకృష్ణభగవానుడు. అందుజెప్పబడినది శ్రీభగవ న్మతము. ఇదియే శ్రీకృష్ణ భగవానుడు శ్రీభగవద్గీతలలో:-

యేమేమతమిదం నిత్యమనుతిష్ఠంతి మానవాః!
ఈ నామతమను నెవ్వరు నిత్యమాచరింతురో
(భ.గీ. అ.3. శ్లో 31)

యేత్వేతదభ్యసూయన్తో నాను తిష్ఠంతి మేమతమ్
ఈమతము నాచరింపరో (భ.గీ. అ.3. శ్లో 32)

కర్తవ్యానీతి యే పార్థ నిశ్చితం మతముత్తమమ్

నిశ్చయింపబడిన తిరుగలేని యుత్తమమైన నామతము
(అభిప్రాయము) (భ.గీ. అ.18 శ్లో 6)

ఇట్లు శ్రీకృష్ణభగవానుడు తనమతమును భగవద్గీతల యందు జెప్పి యున్నాడు కావున మనమతము భగవన్మతమంటిని.

కుమారి : నాయనగారు! శ్రీకృష్ణభగవానుడు ద్వాపరాంతమున నున్నవాడు ద్వాపరాంతమున జెప్పిన శ్రీకృష్ణమతము భగవన్మతమెట్లగును?

తండ్రి : అమ్మా ! మంచివిషయమడిగితివి. భగవద్గీతయందే యీవిషయము నిర్ణయింపబడినది.

భగవానుడు అర్జునా ఈ నా మతసిద్ధాంతమును సూర్యున కు మొదట జెప్పితిని. సూర్యుడు మనువుకు జెప్పెను మనువు ఇక్ష్వా కునకు జెప్పెను.

ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహ మవ్యయమ్
(భ.గీ. అ.4. శ్లో 1)

ఇట్లు రాజర్షి పరంపరగా నీమతము వ్యాపించినదట.

ఏవం పరంపరా ప్రాప్తమిమం రాజర్షయో విదుః
సకాలే నేహ మహతా యోగోనష్టః పరంతప
(భ.గీ.అ.4, శ్లో 2)

అట్టిది నిప్పుడు క్షీణించుటచే (కాలగతిలో ప్రజలు మరచిపోగా) మరల నీకు నీవు నా భక్తుడవని స్నేహితుడ వని యీ ఉత్తమమైన రహస్యమైన మతమును నీకుప దేశించితి ననియెను.

భక్తోసిమే సఖాచేతి రహస్యం హ్యేతముత్తమమ్
(భ.గీ. అ.4. శ్లో 3)

అప్పుడు అర్జునుడు కృష్ణా నీవు మొన్న బుట్టితివి. సూర్యు డెప్పుడో సృష్టితో నుదయించెను. నీవు సూర్యునకెట్లు పదేశించితివనెను. అప్పుడుశ్రీకృష్ణుడు అవతార రహస్య జ్ఞానమును వెల్లడించి తన నిత్య స్వరూపమును దెలిపెను.

కావున భగవంతునిచే జెప్పబడినది ఇది భగవన్మతమనుట సరిపడినది గదా ! అట్టి భగవన్మతము శ్రీ భగవద్గీతల యందు ఘనీభవించి యున్నదని తెలియుచున్నది గదా? ఇంక సందేహమేమి?

అంతేవాసిని నాయనగారు మన భగవన్మత స్వరూపమును సంక్షిప్తముగా బ్రసాదింపుడు.

తండ్రి : అమ్మా యందులకు సందేహము లేదు. ఈ విషయముతో సులభపద్ధతిని దెలుపుదును. మీరు జాగరూకతతో వినుడు. మన భగవన్మతమున రెండు మార్గములు చెప్పబడినవి. 1. ప్రవృత్తి మార్గము 2. నివృత్తి మార్గము. ప్రవృత్తి మార్గమనగా నీ సంసారము నందు ప్రవేశించి తానొనరించుకొను పుణ్యపాపకర్మఫలముల వలన బుణ్య లోకములకు బాపలోకములకు బోవుచు పుణ్య లోకములలో పుణ్యఫలమగు సుఖము ననుభవించుచు, పాప లోకములలో బాపఫలమగు దుఃఖము నను భవించుచు ఆఫలముల పరిమితులై పోవుటతోడనే మరల భూమిపై దన కర్మమునకు దగిన పుట్టువును బొందుచు మరల పుణ్యపాప కర్మము లొనరించుచు మరల పుణ్య పాప లోకములకు బోవుచు మరల జన్మము లెత్తుచు నీ ప్రకారముగా సంసార చక్రమున బరిభ్రమించుట ప్రవృత్తి మార్గము.

భార్య పుణ్యలోకములు, పాపలోకములు అనుచున్నారు. పుణ్యలోక మొక్కటి, పాపలోకమొక్కటియేగదా యున్నది.

తండ్రి : కాదు. పుణ్యకార్యములు వేనకు వేల విధములుండును. పాప కార్యములు వేనకు వేలుండును. ఎట్టి పుణ్య కార్యములు చేసిన వారికి నట్టి పుణ్యఫలములకు దగిన

లోకములుండును. పాప కార్య భేదములను బట్టి పాప లోకముల భేదములుండును. కావున లెక్కలేనన్ని పుణ్య లోకములు లెక్కలేనన్ని పాపలోకములు గలవు

కుమారుడు · ఇవన్నియు నెక్కడ యున్నవి యందురు నాయనగారు ?

తండ్రి . నాయనా ! ఆకాశమంతము లేనిది గదా చెప్పితిని ఇట్టి యనంతా కాశములో నెన్ని గోళములుండవచ్చునో లెక్కకందవు గదా ! కాబట్టి యవియన్నియు నీయాకాశము నందే గలవు.

భార్య · స్వామీ ! అన్ని మతములు నీపాప పుణ్యలోకములను జెప్పుచున్నవా !

తండ్రి : లేదు. అట్లు చెప్పవు. పుణ్యము చేసినవారికి శాశ్వత పుణ్యలోకము, పాపము చేసినవారికి శాశ్వత పాపలోకము బౌద్ధ మతములో బుణ్యపాప లోకముల ప్రసక్తియే యుండదు.

అంతేవాసిని : కొంచెము పాపము, కొంచెము పుణ్యము చేసిన వారి గతి యేమందురు ?

తండ్రి . అది విచారింపదగినదే. మనుష్యుడు కేవలము పుణ్యము చేయ లేడు. కేవలము పాపము చేయలేడు. పాప పుణ్యముల కలయియే మానవ జన్మము. అందువలన శాశ్వత పాపపుణ్యలోకములను మన భగవన్మత మంగీక రింపదు నీవొకతూరి పరీక్షతప్పితివి. నీ తమ్ముడొకతూరి పరీక్ష తప్పెను. మిమ్ములను మరల పరీక్షకు రానీయమని ప్రభుత్వము వారన్నచో మీగతి యేమి ? మీరు పడిన శ్రమ వృధాయేగదా! మీరు సంపూర్ణ జ్ఞానమును సంపా దించుటెట్లు ? మానవులందరి తెలివి తేటలొకరీతిగా

యుండవు గదా ! చెప్పిన వెంటనే యొకరు గ్రహించును. రెండు మూడు పర్యాయములు చెప్పిన మఱియొకడు గ్రహించును. కావున విద్యార్థికి సావకాశమిచ్చుట విద్యనే నేర్పదలచిన గురువు ధర్మము కావున దయావంతుడగు భగవంతుడు పాపికి సావకాశము నిచ్చును. పుణ్యునకు సావకాశమిచ్చును. పాపపుణ్యముల గతులు విడచి నివృత్తి మార్గ మవలంబించినపుడు శాశ్వత మోక్షము నిచ్చి తన యొద్దకు జేర్చుకొనును

కుమారి నాయనగారు పుణ్యమును గూడ విడువవలయునా !

తండ్రి పాపము జన్మము కలిగించును. పుణ్యము జన్మము కలిగించును. అట్టిచో పాపము కంటె పుణ్యమేమి గొప్ప ? పుణ్యము సుఖరూప మైనది కావున సుఖాభిలాషియై నానావస్థలుపడును కావున పుణ్యార్జనము దుఃఖము తోడనే. కొండచఱియనున్న కుండెడు తేనె తుట్టెను జూచి యొకడు మిక్కిలి యాసపడి యాచెఱియనెగ బ్రాకి తేనె సంపాదించినాడా! అవతల చఱియపై మరొక తుట్టె గాన్పించును. దానికై మరల బ్రయత్నించును ఇట్లే పుణ్య సుఖము లనుభవించిన కొలది యింక ననుభవింప బుద్ధిపుట్టును. వానికై శ్రమింపవలసి వచ్చును. పుణ్య లోకములలో కలుగు సుఖములు పరిమితముగానపుడు విశ్రాంతి యెక్కడిది. "పునరపి జననం పునరపి మరణం పునరపి జననీ జఠరేశయనం" తిరిగి పుట్టుట తిరిగి చచ్చుట తిరిగి తల్లికడుపులోబడుట ఈబండిగాలు వలె తిరుగు దానికి చివర యెట్లుండును. అయిన నొక్కటే భేదము. పాపములు ఇనుప సంకెళ్లు. పుణ్యములు బంగారు సంకెళ్లు. బంగారు సంకెళ్లని మురియుటయే గాని చేతులు తిన్నగా దీసికొనుట సాధ్య పడదు గదా ! అట్టిచో నేసంకెళ్లై

ననేమి? కావుననే మోక్షము గోరువారు పుణ్యపాపముల రెంటిని విడుతురు.

కుమారుడు. ఈ పుణ్యపాపములకు మూలమేదియందురు ?

తండ్రి . పుణ్యములకు బుణ్యకర్మము, పాపములకు బాపకర్మము ఈ కర్మ స్వరూపమును దెలిపెద వినుడు.

కర్మము నిత్యమనియు, నైమిత్తికమనియు రెండు విధములు. ఇందులో నిత్యకర్మము కులమును బట్టియు నాశ్రమమును బట్టియు నుండును. మనమతములో బ్రధానముగా నాలుగు కులములు చెప్పబడినవి. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు. ఈసందర్భములో ప్రస్తుతమున్న కులములను మనసు లో బెట్టుకొనకుడు. ప్రస్తుతము పూర్వము చెప్పబడిన కులము లుప్తప్రాయము. అనగా లేనిదానితో సమానమైనదే. వేదములు మొదలగు వానియందు కులములు చెప్పబడినవి. ఏకులము వారే కర్మములు స్వధర్మములుగా నాచరింప వలయునో చెప్పి యున్నవి. ఈకులధర్మము లుగా జెప్పబడిన కర్మము మరల రెండు విధములు. 1.కులము ననుసరించిన వైదిక కర్మము. 2. కులము ననుసరించిన జీవనకర్మము.

వైదిక కర్మములు ఎనిమిది (8) విధములు.

1.స్నానము, 2. సంధ్యావందనము, 3. పంచయజ్ఞములు, (i). బ్రహ్మయజ్ఞము, (ii)..పితృయజ్ఞము, (iii)..ఋషి యజ్ఞము, (iv).. దేవ యజ్ఞము, (v). భూతయజ్ఞము చివరది (ఎనిమిద వది) భగవదా రాధనము. ఈ యెనిమిది నిత్యకర్మలను కులముతో బనిలేకుండ స్త్రీ పురుషులెల్ల

రాచరింప వలసినదిగా శాస్త్రములు చెప్పుచున్నవి. అయిన నింకొక్క విశేషమును గమనింపవలయును. ఈకర్మము లను బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు మాత్రము వేద మంత్రములతో నాచరింపవలయును. అన్ని కులముల లోని స్త్రీలు, శూద్రులు వేదమంత్రములను విడిచి పౌరాణికముగ నాచరింపవలయును. ఆచరింపవలసిన విధి యెల్లరకు సమానము. ఆచరించినందువలన గలుగు ఫలము సమానము. ఆచరింపక పోయినందువలన గలుగు దోషము సమానము. ఆచరించుటలో గల విధానము మాత్రము వేఱు. నారాయణా యని సంస్కృత పండితుడు స్మరించును. నారనా యని కేవలము తమిళ పండితుడు పిలుచును. సంస్కృతములో బిలిచిన పండితునకు మాత్రము శ్రీహరి రక్షణమునిచ్చి యందులో గొన్ని యక్షరముల విడిచి, మార్చి పలికిన తమిళ పండితునకు శ్రీహరి రక్షణ మీయడా! పూర్వమొక బ్రాహ్మణుడెంతకాలము నుండియో తపము చేయు చుండెనట. ఎంతకాలము శ్రమపడినను శ్రీహరి యతనికి దర్శనమీయలేదు. రోజు అచటికి గొఱ్ఱెలకాపరి వచ్చు చుండెనట. ఆ బ్రాహ్మణుని స్థితి చూచుచునే యుండెను చూచి చూచి యతనికి విసుగుపుట్టెను. ఒకనాడా గొల్లబోయడా బ్రాహ్మణుని సమీపించి అయ్యా రోజు రోజు ఇచట గూర్చుండి యేమి చేయుచున్నారు అనియడిగెను. ఆయన నేను భగవంతునికై తపము చేయుచుంటిని అనెను. అందులకా గొల్లవాడు ఏమి ఇన్నాళ్లు పిలచిన మీకు భగవంతుడు కనబడలేదా! నేనొక్కకేక పెట్టి యాయనను రప్పింతును జూడుము అని ఓ బొల్లి గద్దనెక్కిన నల్లనయ్యా యని కేకపెట్టెను శిష్టులు నీ మాటను గరుడవాహనా రూఢ శ్రీమన్నారాయణ యని

చెప్పుదురు వెంటనే గరుడ వాహనము నెక్కి శ్రీహరి ప్రత్యక్ష మయ్యెను గొల్లవానిని శ్రీహరి కరుణించి తనలోకమునకు దీసికొనిపోయెను. బ్రాహ్మణుడది చూచి యాశ్చర్యపడి తనస్థితికి జింతించెను. కావున గావలసినది భక్తియు, శ్రద్ధయుగాని పలుకుల యాడంబరము కాదు

భార్య · స్వామీ ! ఈ యెనిమిది కర్మములు స్త్రీలు, పురుషులష్టాదశ వర్ణముల వారు చేయవలెనంటిరే చేసిన ఫలితము లేదు చేయక పోయిన దోషమని చెప్పితిరే. అదియెట్లు ?

తండ్రి అవును. ఈనిత్యకర్మములు వారివారికి కులాతీతమైనవి ఒక్కటి చెప్పెద వినుము. నీకు నేను భర్తను. నిన్ను నేను బోషించుచున్నాను. నీవు నా భార్యవు. నాకు నీవు భోజనము పెట్టి యన్ని విధముల గాపాడుచున్నావు ఈ పనులవలన నీకును నాకును పుణ్యములు వచ్చునా.

భార్య . ఎందులకు వచ్చును. మీరు భర్తలు. నన్ను పోషించుట మీ ధర్మము గావున మీరు పోషించు చున్నారు. మీకు నేను భార్యను. మీకు సేవచేయుట నా ధర్మము గావున నేను జేయుచున్నాను. ఇందులో పుణ్యమెట్లు వచ్చును ?

తండ్రి : అవును. అంతియే. అది మనవిధి. మన అబ్బాయికి, అమ్మాయికి విద్యలు నేర్పి, పెండ్లిండ్లుచేసి యాస్థి సంపాదించి యిచ్చుచున్నామే యిది పుణ్యకార్యమే అగునా కాదు తల్లిదండ్రుల విధి. మన విధి మనము నిర్వహించక పోయిన దోషము. నిర్వహించిన తన స్థితిని గాపాడు కొన్నట్లు. ఆలికి నన్నము పెట్టుట యూరికు ప కారమా! యన్న సామెత వినలేదా ! కాబట్టి కులోచితముగా భగవంతుడు నిర్ణయించిన నిత్యకర్మలకు బ్రత్యేక ఫలము లేదని చేయకున్న దోషమనియు జెప్పితిని.

కుమార్తె : చేయకపోయిన నెట్టిదోషము వచ్చును ?

తండ్రి భార్యను పోషింపక విడిచిన లోకములో నింద, తన్మూల మున బరలోకములో పాపఫలము. అట్లే భర్తకును. నిత్య కర్మములు విడిచిన భ్రష్టత పాపము. మానవుడై జన్మించి తానావిధులొనర్పక పోయిన పశు పక్ష్యాదుల పుట్టుకలు. ఎన్నెన్నో బాధలు గలవు. క్లప్తముగా జెప్పితిని. ఇక వృత్తి కర్మములను జెప్పుదును.

బ్రాహ్మణులు 1. వేదమును జదువుట, చదివించుట.
2. యజ్ఞములు మొదలగు వానిని జేయించుట.
3. దానము పుచ్చుకొనుట.

క్షత్రియులు : 1. భూమికి రాజులుగా యుండి పరిపాలించుట.
2. దానమిచ్చుట.

వైశ్యులు కృషి, గోసంరక్షణ, వాణిజ్యము.

శూద్రులు · పశుపాలనము, సేవ, (రాజకీయోద్యోగము)

భగవంతునిచే నిర్మింపబడిన యొకమానవ కుటుంబము నకు బురోహితుడు బ్రాహ్మణుడు. పరి పాలకుడు క్షత్రియుడు జీవకుడు వైశ్యుడు. కార్య నిర్వాహకుడు శూద్రుడు. ఈవృత్తి నిర్ణయములో సూక్ష్మాది సూక్ష్మముగా బరిశీలించిన వృత్తిభంగము కలుగునది బ్రాహ్మణునకు, క్షత్రియునకు మాత్రమే. బ్రాహ్మణుడు వేదము చదువక, చదివినను జెప్పు తెలివితేటలు లేక యజ్ఞములు చేయింపలేక దానమును బుచ్చుకొనుటకు నర్హతలేక పోవచ్చును. అట్టి వానికి సామర్థ్యమున్న క్షత్రియ ధర్మమగు యుద్ధవీరత్వము నవలంబింపవచ్చును. అదియు

జేతగాకున్న వైశ్యధర్మమవ లంబించి మడిదున్నిక బ్రదుకవచ్చు క్షత్రియుడు పరాక్రమ రహితుడై చెడినప్పుడు వైశ్యవృత్తి నవలంబింపవచ్చును. కార్యనిర్వాహకత్వము పూనవచ్చును. వైశ్యవృత్తి జెడదు. శూద్రవృత్తి జెడదు. ప్రస్తుత సంఘమును విచారింపుము., క్షత్రియజాతి నామమాత్రా వశిష్టమయినది. రాజ్యపాలనము వారినుండి తొలగినది వారు వైశ్య, శూద్ర వృత్తులనే యవలంబించుచున్నారు. తమస్వవృత్తుల యందు జీవనము గడవనిచో మిగిలిన వృత్తులవ లంబింపవచ్చునని శాస్త్రములే చెప్పుచున్నవి. వృత్తియవలంబించిన మాత్రమున పుట్టుకతో వచ్చిన కులముపోదు. వృత్తిరక్షకు గడుమేలు వృత్తరక్ష వృత్తిని గాపాడుకొనవలయునా, ప్రవర్తనమును గాపాడుగొన వల యునా అనిన వృత్తిని గాపాడుకొనుటకంటె వృత్తమును గాపాడుకొనుటవేలని పెద్దల వాక్యము. వృత్తము పోయినందులకు మనము విచారపడ వలయును గాని వృత్తిపోయినందులకు విచారపడబనిలేదు.

ఇక నైమిత్తిక కర్మములను గుఱించి యాలోచింతము. ఏదో నిమిత్తము వలన గలుగునవి నైమిత్తిక కర్మములు. ఇవి రెండు విధములు. 1. కవ్యములు. 2. హవ్యములు. కవ్యములనగా చనిపోయిన వారి గుఱించి చేయునవి. హావ్యములనగా దైవము గుఱించి నలువునవి. కవ్యములు. తద్దినములు, పితృతర్పణ ములు, సంక్రమణ కాలములలోను గ్రహణ సమయములందు దానములు. మరణ సమయమున జరుపు కర్మకాండలు. ఈ కార్యము లన్నికులములవారు ఆచరింపవలసినదే. తప్పించు కొనుటకు వీలయినవి కావు. హవ్యములు. ఇవి యేకాదశి ఉపవాసములు. శ్రీరామనవమి, శ్రీకృష్ణాష్టమి మొదలగు భగవజ్జయంతులు శివరాత్రి, వినాయకచవితి, మహా

నవమి, విజయదశమి, దీపావళి మొదలగు పండుగ పూజలు. ధనుర్మాసపూజ (ప్రతి ఆంగ్ల సంవత్సరము డిశంబరు 15,16 నుండి మరుసటి ఆంగ్ల వత్సరము జనవరి 13,14 వరకు జరుగుపూజ) కార్తీకాది మాస వ్రతములు. అన్ని కులముల వారు ఆచరింపదగినవియే. ఇందు ఈ కులము వారు చేయరాదని నిషేధము లేదు. ఇట్లు విచారింపగా నిత్య నైమిత్తిక ములను రెండు విధములగు కర్మలన్ని కులములవారికి విధులగు చున్నవి. ఆచరణము లో వైదికమంత్రములు కొందఱుపయో గించిన పౌరాణిక మంత్రములు కొందఱుపయోగింతురు. ఆచరణ ఫలతార తమ్యము లేదు వైదికమంత్రములకు నధికారము గల వారు కూడ కామ్యవ్రతములలో బౌరాణికమార్గమేయవ లంబించు చున్నారు.

అంతేవాసిని: నాయనగారు ఈకులములెవరు పుట్టించినారు. మొన్న దేవాలయములో నొక పెద్ద యుపన్యసించుచు నీ కులములు స్వార్థ పరులేర్పఱచినారనినారే. మీరేమని యనుగ్రహింతురు ?

తండ్రి . అమ్మా ! మంచిప్రశ్నయడిగితివి. ఎవరు పుట్టించినది యెట్లు పుట్టించినది తరువాత జెప్పుదునుగాని పూర్వము స్వార్థపరులగు పెద్దలు వీనిని పుట్టించిరనుమాట కల్ల. అది యీర్ష్యావాదము. అందఱొకే కులముగా నున్నకాలములో పెద్దలొకసభజేసియో, మఱొక విధముగనో నీవు బ్రాహ్మణుడుగా నుండుము. నీవు క్షత్రియుడిగా నుండుము, నీవు వైశ్యుడుగా నుండుము. నీవు శూద్రుడుగా నుండుమని కట్టడిచేసిన నొప్పుకొనువారెవరు ? కొందఱొప్పు కొనక పోయిన వారందఱేకులము వారగుదురు? నేను భూమి నేలుదును. నీవు పశువులగాచుకొమ్మనిన నిచ్చగింతురా?

నేనే భూమియేలెదను, నీవు గొడ్లగాచికొమ్మనియనరా ! ఇట్లగుట యేనాటికైనా నెక్కడనైనా సంభవమా ! లేనిపోని వైరములు పెంచ దోచు దుర్బుద్ధుల వాదములియ్యవి. ఈకులభేదములు సృష్టి తోడనే వచ్చినవి. మానవులలో కులభేదము కలదు. దేవతలలో కులభేధము కలదు జంతువులలో గులభేదము కలదు. చేపలలో కలదు, పాములలో గలదు. చెట్లలో గలదు. రాళ్లలో గలదు. కుల భేదము లేని వర్గము సృష్టిలో నేమైనయున్నదా చెప్పుడు.

కుమారుడు : ఎందుకు లేదు. క్రైస్తవులకు గులభేదము లేదు మహమ్మదీయులకు లేదు. బౌద్ధులకు లేదు. మతేమన్న.

తండ్రి : మతేమన్న వలదు. నీవు చెప్పినవారిలోనే కులభేదము కలదు. క్రైస్తవులలో రోమన్ కేథలిక్కులు, ప్రాటస్టెంటులను నిరు తెగల వారున్నారు. వారి ధ్యానమందిరములు వేఱు. వారి యాచారములు వేరు. ఒకరి నొకరు నిలువున కాల్చి ప్రాణములుదీసి హింసించి కొన్న దినాలు గలవు. వారి సంఘ చరిత్ర జదువుము. మహమ్మదీయులలో షియాలు, సున్నీలు అను రెండు తెగలు గలవు. ఆచారభేదము లున్నవి. వారివారి ప్రార్ధనా మందిరములు కూడ వేఱు. బద్ధ విరోధముతో నొకరినొకరు హింసించికొనిరి. బౌద్ధులలో హీనయానులు, మహాయానులు, జైనులలో శ్వేతాంబ రులు, దిగంబరులు అని ఇరుతెగలవారున్నారు. వారి యంతః కలహములు వారి యాచార వ్యవహార భేదము లను జెప్పుచున్నవి.

కుమారుడు : కాని వారిలో భేదములు మత సిద్ధాంతములను బట్టి వచ్చినవి. మన కులములట్టివి గాదే.

తండ్రి : అవును మత సిద్ధాంతములైన యవాంతరభేదములలో నేర్పడిన తెగలు మనలో నన్ని కాలములలో నున్నవి. మత సిద్ధాంతములో గలుగు కొంచెము భేదము మనకు ముఖ్యము కాదు. కులములు సృష్టిలో వచ్చినవంటిని సృష్టియే భేదప్రవృత్తి. భేదప్రవృత్తియే సృష్టి ధర్మము. అభేదప్రవృత్తి సృష్టికి పూర్వదశ. ఆయాజీవులు వారివారి కర్మవాసనలలో మైనపుటుండలో బంగారు రేణువులవలె ప్రకృతిలో నిమిడియుండగా భగవంతుడు సంకల్పము చేసి సృష్టి కున్ముఖుడగును. సృష్టిలో ప్రకృతియందు లీనమైయున్న జీవులు కర్మవాసనల బట్టి వారికి దగిన పుట్టువులను బొందుదురు. ఇట్లు చూడగా నీ సృష్టికి హేతువు పూర్వసృష్టి. పూర్వసృష్టికి హేతువు తత్పూర్వ సృష్టి అట్లే రాబోవు సృష్టికి హేతువు ఈ సృష్టి. జీవుడు మోక్షము పొందు పర్యంతము తన పాపపుణ్య రూప కర్మ వాసనా బలమున సృష్టి, స్థితి, లయ చక్రమున బరిభ్రమించు చుండును. సృష్ట్యాదిలో భగవంతుడు సృష్టి చేయునపుడు ఆయాజీవుల గుణ కర్మ స్వభావములను బట్టి యాయా కులములందు సృజించునే కాని తాను స్వతంత్రించి కారణ భూతుడుగాజాలడు. ఇయ్యది శాస్త్రములందు బ్రసిద్ధము. కావున గుణములు కులములు ఒకరొకరికి కల్పించినవి కావు. వారివారి స్వార్జితములే.

ఇక నివృత్తి మార్గమును వివరింతును. జీవుడు ప్రకృతి స్వరూపమును దెలిసికొని దానివలని బంధములార్చుకొని తన స్వరూపమును గుర్తించి భగవత్స్వరూపమును దెలిసికొని భగవంతునకు దనకుగల సంబంధమును గ్రహించి భగవంతుని జేరుటలో జన్మజరా బంధములను దెంచుకొను మార్గము నివృత్తి మార్గము. ఈమార్గము సర్వ

మానవులకు సమానము. ఈ మార్గమున నడుచుకొనుటకు గులములు సహాయపడవు. భంగము సేయవు. అనగా నగ్రవర్ణుడని చెప్పుకొను బ్రాహ్మణునకు నివృత్తి మార్గ గమనములో బ్రాహ్మణత్వము సహాయపడదు. తక్కువ కులమని చెప్పబడు పంచమునకు వాని తక్కువ కులము వానికి నివృత్తి మార్గములో నడ్డమురాదు. ఈమార్గగామికి గావలసినవి ప్రధానముగా మూడు.

1. పవిత్రకర్మాచరణము, 2. సందేహములేని సత్యజ్ఞానము, 3. ఫలా పేక్ష లేని భగవదారాధనము. పవిత్ర కర్మాచరణ మనగా నిష్కామ్య కర్మాచరణము. పవిత్ర కర్మా చరణమునకు బవిత్ర హృదయము కావలెను.

పవిత్ర హృదయమును బొందుటకై యమాది నియమము లుండవలెను.

1. దేహముతో వచ్చినది కులము. ఆత్మకు సంబంధించినది కాదు. కావున కులాభిమానమును మనస్సులో విడుచుట.
2. అహింస, భూతదయ
3. అరిషడ్వర్గమును జయించుట
4. ఇంద్రియ నియంత్రణ
5. సత్యము, శౌచము, అస్తేయము (దొంగతనము లేకుండ)
6. దానము
7. ధర్మము
8. ప్రాణిసేవ

9. సజ్జనసాంగత్యము

10 గురుశుశ్రూష మొదలయినవి కలిగినచో పవిత్ర హృదయము కలిగి పవిత్ర కర్మాచరణ మొనరించును.

సందేహములేని సత్యజ్ఞానము నలవరచుకొనుటకు ప్రకృతి స్వభావమును గుర్తెఱుగుట, జీవతత్త్వము తెలిసికొనుట, భగవత్స్వరూపము నెఱుగుట, వీనిని దెలుపు భగవచ్ఛాస్త్రములను దెలిసికొనుట, గురూపదేశము బొందుట మొదలగునవి ముఖ్యము.

పవిత్ర హృదయము, నిస్సంశయజ్ఞానము గలిగిన తరువాత భగవదా రాధనము చేయువలెను. భగవదారాధనయందు నవలంబింపవలసిన పద్ధతులు కొన్ని కలవు.

1. భగవంతునికి శరణాగతి చేయుట
2. భగవంతునిపై సర్వభారమునుంచుట (భరన్యాసము)
3. భగవంతుని నామ స్మరణము, గుణకీర్తనము.
4. భగవంతుని కథాలాపము.
5. భగవంతుని ప్రతీకారాధన (విగ్రహారాధన)
6. మానసికారాధనము
7. భగవంతుని విశ్వరూపునిగా జూచుట
8. విశ్వమును భగవద్రూపముగా జూచుట.
9. మానవసేవయే మాధవసేవగా దలంచుట.

10. మాధవసేవయే మానవసేవగా దలంచుట

11 మనస్సు భగవంతునిపై లగ్నము చేయుటకు వలసిన యోగాదులు.

12. జపములు

మహామంత్రమగు శ్రీమన్నారాయణాష్టాక్షరిని ప్రణవముతో నష్టా దశ వర్ణముల వారు జపించవచ్చును.

13. దేవతార్చనము (సాలగ్రామార్చనము గూడ) మరియు

14. నిష్కామ్య కర్మాచరణము

వేదములు తలక్రిందులుగా జదివిన బ్రాహ్మణుడైనను, సన్యాసము పుచ్చుకొన్న స్వాములవారైనను నివృత్తి మార్గ మవలంబించి మోక్షము పొందగోరెనా పైనివృత్తి మార్గ విధానము నవలంబింప వలసినదే కాని వేఱుగతి లేదు. కులమెవ్వరిని రక్షింపదు. కులధర్మములు మోక్షమునకు గావు. పై జెప్పిన మూటినే కర్మ, జ్ఞాన, భక్తులని పెద్దలు చెప్పుదురు. విశేషించి తరువాత వానిని గుఱించి తెలిసికొనవచ్చును.

కుమారి : మోక్షమునకు బనికిరాకపోయిన యీ కులములను విడిచివేసి యందరొకే కులమయిన బాగుండదా ! అప్పు డొకరికి నొకరికి తగవులు లేకుండబోవును గదా.

తండ్రి : అమ్మా ! నీవడిగనమాట లెస్స. తగవులకు గారణములు కులములు గావు. అన్నదమ్ములు పోరాడుకొని న్యాయ స్థానముల కెక్కి సర్వనాశనము అగుటలేదా. తండ్రి కొడుకులు పోట్లాడుకొనుట లేదా. స్వార్థపరత్వము తగవులకు మూలము. సహనశక్తి, గర్వములేమి,

నిర్మలమైన భగవద్భక్తి కలిగినచో మైత్రికుదురును ఆచారము, మతము, కులములు ముందునకు దెచ్చుకొని మానవుడు మానవత్వమును కోలుపోయి పోట్లాడికొనుట మంచిది కాదు. లోకములో భేదము సుస్థిరము. దానిని తొలగింపనలవికాదు. భేదముతో నభేదమును (Unity in diversity) సాధించుకొని మానవుడు సంఘజీవియై సంఘమున కుపకరించుచు వ్యక్తిత్వమును బోషించుకొనుచుండవలెను. మనభారత ఖండములో కులములు నాశనము చేయవలెనని యెందఱో మహావ్యక్తులు ప్రయత్నించిరి. అది వారికే నవసరమైనది. బౌద్ధమతమునకు బూర్వమున్నది మనభగవన్మతమే. బుద్ధుడెవరిని బౌద్ధ మతములో జేర్చుకొనవలసి వచ్చినది. హిందువులనే, వారికి దీక్షయనునది పెట్టి తననూతన మతములో చేర్చికొనవలసి వచ్చెను. ఆయనకు గావలసినది తనమతము ననుసరించువారు. అందువలన హిందువుల నుండి యన్ని కులముల వారిని దీసికొని బౌద్ధులుగా జేసెను. కొత్త మతము పెంపొందవలెననిన ప్రచారము గావలెను. ఇతర మతస్థులను తన మతములో గలిపి కొనవలెనా ? ఏసుక్రీస్తు జేసినపనియు నంతియే. మహమ్మదు చేసినపని యంతే. ఇప్పటికి బౌద్ధులు, క్రైస్తవులు, మహమ్మదీయులు చేయుచున్న పనియే. వారు అన్య మతస్థులకు బోధలు చేసి, బాధలు పెట్టి తమ మతములో జేర్చుకొనుట లేకపోయినచో భారతదేశము నందీ మతములుండవు. ఈ మతములలో జేరువారు తగ్గిపోయినచో భారతదేశములో నీ మతములు క్షీణించును. అదియుగాక తల్లి దండ్రులు మతము పుచ్చుకొనిన చాలదు. బిడ్డలు మరల బుచ్చుకొన వలయును. మనదేశములో ఈ మతములస్థితి కాల ప్రవాహిక ననుసరించియుండును. ఆమతములో బుట్టు సంతానములే

యామతము బుచ్చుకొనకపోయిన మత మెగిరి పోవును అందువలన నామతము కెప్పుడు ప్రచారము జరుగుచుండ వలెను. ధనికులు, ఇతర దేశ ప్రభుత్వములవారు డబ్బిచ్చి మతప్రచారము చేయింపవలె. మతములో జేరువారికి నాధ్యాత్మక బోధనకంటె స్వార్థలాభము. మిక్కుటముగా జూపింప వలెను. ఇట్టి ప్రచారములు జనసంఖ్యకోసము ప్రాకులాడుటచే జనసంఖ్య మరల నేటి ప్రజాప్రభుత్వము లలో రాజకీయ సమస్యకు ననుబంధించి యుంటచే ననేక కలహములకు నాకరమయి ప్రజాశాంతికి భంగములగు చున్నవి. మతబోధయే ప్రధానముగా బెట్టుకొని వేరొకరికి జీతగాడుగాక మతప్రచారము చేయువారితరమతము లందు గానవచ్చుట లేదు. స్వార్థ పరత్వముచే గాక యితర మతములలో జేరినవారు గానరారు. శ్రీభీమరావు. ఆర్. అంబేద్కరుగారు తాము బౌద్ధమత తత్త్వము గ్రహించి బౌద్ధ మతస్వీకారము జేసిరనిన నమ్మవచ్చును. వారు విద్వాంసులు, విమర్శకులు, సుప్రసిద్ధ న్యాయశాస్త్ర ధర్మజ్ఞులు. వారితో జేరిన రెండు లక్షలమంది విషయ మేమందురు ? వారందఱకు నాధ్యాత్మికదాహము కారణ మందురా. జనసంఖ్య కొఱకే అంబేద్కరు ఈపనిచేసిరని నమ్మరాదా. వీరందరు బౌద్ధమతము స్వీకరించి బౌద్ధ భిక్షువులై వారి సంసారములను త్యజించిరా ? బుద్ధుడు చెప్పిన సిద్ధాంతములు రాను రాను మాఱి హిందూమత ప్రవృత్తి మార్గమును గావలసినంతమటుకు నవలంబించి గృహస్థధర్మములో నిలిచిపోవుచున్న వనుటకు నేటి గృహస్థులున్న (బౌద్ధ) దేశములే ప్రమాణములు. కావున కులములు నశింపజేయ వలెనని ప్రయత్నించినచో గ్రొత్తకులము లేర్పడును. ఏర్పడినవి కూడ. మతములోనే కుల ప్రణాశమునకు బూనుకొన్న వీరశైవులు, జంగమ,

బణజిక, పంచమశాలి మొదలగు కులములై వేరయినవి. వీర వైష్ణవులు సాతానికులమై వేఱయినది. ఇప్పుడు ప్రపంచ పరిస్థితులను గమనించి ప్రపంచ మానవ క్షేమమునకై యొక్క మతము, నొక్కజాతి వేర్పఱుప వీలగునా. అట్లొక మతము నొకేజాతియని నియమించు కొన్నను పరస్పర కలహములు పోవునా. మొన్నగడచిన రెండు ప్రపంచ యుద్ధము లెవరెవరికి జరిగినవి ? క్రైస్తవులలో గ్రైస్తవులకు కాదా. మహమ్మదీయులలో మహమ్మదీయులకు గాదా. భిన్నభిన్న దేశవాసులు తమజాతి మత సంస్కృతుల రక్షించు కొనుచు, అన్యదేశ వాసుల జాతిమత సంస్కృతుల నాదరించుచు నన్యోన్య సహకార పద్ధతులపై బ్రవర్తించిన గదా శాంతిచేకూరునది. కావున నీతి, మానవత్వములు తోడిమానవుని నాదరించును. కులముల జెఱుపుటకు వీలుకాదు. చెఱపిన క్రొత్త కులములు పుట్టును. నేటి క్రైస్తవ మతములో కమ్మ క్రైస్తవులను (మతస్థులు) వారున్నారు. వారు తమ క్రైస్తవుల తోడనే సంబంధ బంధములు చేయుచు బ్రత్యేక క్రైస్తవకులముగా నిలిచి పోయినారు. మాలక్రైస్తవులకు, మాదిగ క్రైస్తవులకు బొత్తులేదు. హిందూమతములోని కుల తత్త్వము మతాంతరస్థితిలో గూడ విజృంభించి యున్నదని గ్రహింప వలెను. దేహముతో వచ్చిన కులము దేహముతో బోవలసినదే. ఆత్మలో వచ్చినది కాదు గావున ఆత్మమోక్షమునకు, కులమునకు సంబంధము లేదు.

కుమారుడు: నాయనగారు హిందూమతమునకు మాత్రము ప్రమాణాలు మూలము కాదా. నేడు హిందూమతము క్షీణించుచున్నదా. మతేతరులు మనమతములో వారిని తమ మతములో జేర్చుకొనుచున్నారు గదా. ఈ మాదిరిగా చేసిన మనమతము లేకుండబోవదా?

తండ్రి : నాయనా యొకమాట బౌద్ధమతముపుట్టి 1300 సంవత్సరముల పాటు (757 క్రీ.శ. వరకు) మన హిందూ మతమును దలక్రిందులు చేసినది. కులములను చెఱచినది. ఇట్లు చేయగలుగుటకు బ్రధాన కారణము హిందూమత సాంప్రదాయమును జీర్ణింపజేసి కొనుటయే. అట్లుచేసియు ఇక్కడ మనలేక హిందూదేశము సరి హద్దులు దాటి యవతలకు బోయినది. హిందూ దేశములో దానికి నిలువ నీడ లేకుండపోయినది. మహమ్మదీయులు రాజ్యా క్రమణలో మతప్రచారముచేసిననూ, రాజ్యము స్థిరము గాదనియు మతరక్షణకు రాజ్యము గలుగ వలయుననియు భరత ఖండములో నల్లకల్లోలము దెచ్చిపెట్టి 750 సంవత్సరముల నిరంకుశత్వమును జూపి యున్నారు. ఈనాడు మనదేశములో నున్న మహమ్మదీ యులు పెక్కండ్రు హిందువులే. క్రైస్తవులలో పెక్కుండ్రు హిందువులే. మహమ్మదీయులవలన గలిగిన యొత్తిడిని తట్టుకొనగలిగితిమి. తదుపరి క్రైస్తవులు (పాశ్చాత్యులు) 150 సంవత్సరములు బాలించి మనల నేమి చేయ జాలకపోయిరి. సముద్రములో నలలుపుట్టి సముద్రము లోనే యంతరించును. ఇప్పుడు మనది స్వతంత్ర దేశము. ప్రపంచములో మనమొక యున్నత స్థానము నలంక రించితిమి. మనమత, జాతి, సంస్కృతులను జక్కగా రక్షించికొను నవకాశము గలిగినది. అయిన మనలో మనవారికి మనము మనమతధర్మములను బోధించుకొని వారికి మోక్షధర్మము నవలంబించునటుల జేయుట మనవిధి. మనమత సంఖ్య తగ్గిపోవుచున్నది కదాయని మతేతరులను మన మతములో జేర్చుకొనుట మనకు సాధ్యముగాదు. ఇచ్చుటకు మార్గములున్నట్లు నూతన మతస్థులను నేకులము వారితోను జేర్పజాలము. ఎవరును

వారిని జేర్చుటకిష్టపడరు. జనసంఖ్యలో బ్రదకటములో వాపుశ్రేష్ఠమా, బలుపుశ్రేష్ఠమా. తత్త్వము అవగాహనము లేని స్వార్థపరుల కూటమికంటె, నిశ్చలనియమ పరుల సంఖ్య చిన్నదైనను మేలుగదా. అయినను పైన చెప్పినట్లు రాజకీయ సమస్యలతో మతమును ముడిపెట్టుకొనుటకే సంఖ్య కావలసి వచ్చుచున్నది అది స్వార్థపరులవృత్తి. ఎక్కువకాల మాదృష్టి నిలువదు. విశేషించి మతస్వతంత్ర ప్రభుత్వములో ఆయాటలు సాగవు. ఈ దేశములో హిందూ మతము ప్రజలిదా యందురేమో. భగవన్మతము సృష్టిలో నారంభమైనప్పుడు ఇతరులున్నగదా ప్రచారము చేయ వలసివచ్చుట. తమలో తామే భగవత్కథాదికమును జెప్పుకొని యానందించుచుండెడివారు.

అంతేవాసిని : నాయనగారు మనమతములో దేవులు చాలమంది యుండుటచే చెట్టుకు గుట్టకు మ్రొక్కుదుమని యేమేమో నిందలు వేయుదురు. మీరేమందురు.

తండ్రి : అమ్మా, చెట్టుగుట్టల పూజలు మొదలగు వాని యదార్థ విషయములన్నియు దేవతత్త్వమును జెప్పునపుడు చెప్పుదును. మతేతరులనుకొన్నట్లుగావు. ఇపుడు సామాన్య ముగా మన మతము గురించి తెలిసికొంటిరిగదా. ఏమి తెలిసికొంటిరో యొక పర్యాయము జ్ఞాపకము చేయుదును.

1. దేవుడొక్కడే.
2. అతడు సర్వవ్యాపి.
3. జీవుడు శరీరబంధము విడిచి భగవంతుని జేరుటయే మోక్షము. మోక్షము పొందినవాడు మరల ప్రపంచ సృష్టిలోనికిరాడు.
4. ఆత్మయాథార్థ్యమును గుర్తెఱిగి ఫలాపేక్షలేని కర్మమార్గము

నవలంబించి సర్వసమత్వమను యోగమును బూని భగవంతుని సర్వాత్మను యవా(శయించి భరన్యాసము చేయుటయే మోక్షసాధనము.

5. మోక్షసాధనసిద్ధికై యష్టాంగ యోగము తపస్సు మొదలగు భగవదారాధనముల నవలంబించవలయును.

6 కులధర్మములు మోక్షమునకు హేతువులు కావు. ఏజాతివాడైనను ఆజాతిలో నుండియే మోక్షము పొందవచ్చును.

7. ప్రతిమార్చనమునకు గాని సాలగ్రామార్చనకు గాని నారాయణాష్టాక్షరి మంత్రమునకుగాని ప్రతిజాతి స్త్రీపురుషులకు అధికారము గలదు.

8. అహింసా, భూతదయా, సత్య, శౌచాదికము ఈమతమునకు ముఖ్యము.

9. పాప పుణ్యములు రెండును మోక్షమునకు బ్రతిబంధకములు.

10. పాపపుణ్య మిశ్రమ జీవులగు మానవులకును గతులు కలవు.

11. పశు పక్ష్యాదులయందున్న జీవుడును గ్రమముగా మానవుడైకాని విశేష విజ్ఞానియైన మానవసంబంధము వలన నీశరీరము నుండి కాని మోక్షమును పొందవచ్చును



శ్రీమతే నారాయణాయ నమః

# జీవిత విశేషములు

అబ్బూడ్వంశ మూలపురుషుడు, హరితగోత్రోద్భవుడయిన వీరభద్రప్ప ఆదిపూడి (పర్చూరు మండలము, ప్రకాశంజిల్లా) నివాసి కొన్ని శతాబ్దముల తదుపరి ఆ వంశములో శ్రీమాన్ సీతారామయ్య, శ్రీమతి జానకమ్మ అను పుణ్యదంపతులకు జన్మించిన వారిలో వేంకట రమణుడు జ్యేష్ఠుడు, వీరరాఘవ సూర్యనారాయణులు మధ్యములు, వీరభద్రయ్య కనిష్ఠుడు, వీరి సోదరి శ్రీమతి అన్నపూర్ణ. జ్యేష్ఠభ్రాతపై తమ్ములకు భక్తి, గౌరవము ఎక్కువ

శ్రీమాన్ వీరరాఘవయ్యగారు, సూర్యనారాయణగారు (మా పితృదేవులు) ఆదిపూడి సోదర కవులను పేరుతో 1925-35 ప్రాంతములో శతావధాన, అష్టావ ధానములను నేర్పుగా ప్రదర్శించిరి ఆశుకవితలో ప్రావీణ్యము సంపాదించిరి. వారి రచనలను, నైష్ఠికతను, విశిష్టాద్వైతమతాభివేశమును మా తమ్ముడు శ్రీమాన్ అబ్బరాజు శ్రీనివాసమూర్తి చక్కగా వివరించెను. విశిష్టాద్వైత మత ప్రవర్తకులు, న్యాయ, తర్క, వేదాంత శిరోమణులయిన శ్రీమాన్ కోమాండూరి శ్రీనివాస రామానుజాచార్యుల (విద్వాన్ కె.యి టి. రామానుజాచార్యుల వారి పితృపాదులు) కృపాపాత్రులై, ప్రియశిష్యులైన మా తండ్రులు వారి శ్రీహస్తము ద్వారా మంత్రోప దేశమును, పంచసంస్కారములను పొందిరి. తమ వారసులు విశిష్టాద్వైత మతావలంబులగుటకు దోహదము చేసిరి.

శ్రీమాన్ వీరరాఘవస్వామి గారు ద్రావిడ వేదాంతర్గతములయిన తిరుమాల, ఆర్తిప్రబంధము, ప్రపన్న గాయత్రి, (ఇరామానుశనూత్తన్దాది) అను దివ్య ప్రబంధము లను తెలుగులోనికి అనువదించిరి. వాటిని కూడ ప్రకటించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. శ్రీరామానుగ్రహము, పెద్దల ఆశీస్సులతో మా ప్రయత్నములు సఫలీ కృతము కాగలవని మాకోరిక. వీరరాఘవస్వామిగారు పెదనందిపాడు, బాపట్ల (గుంటూరుజిల్లా) ఉన్నత పాఠశాలలో నలుబది సంవత్సరములు ఆంధ్రభాషా పండితులుగా పనిచేసి సాహిత్య సరస్వతి, విద్యార్ణవ అను బిరుదులు పొంది, విశేష ఖ్యాతి నార్జించిరి. 1958 సంవత్సరములో విశ్రాంతులైరి. భాషా ప్రవీణ పరీక్షకు అనేకమంది శిష్యులకు శిక్షణ నొసంగిరి. వారు తిరుమల శ్రీనివాసు నారాధించిరి. భద్రాద్రి రాముని స్తుతించిరి. తిరువళ్లూరు (తమిళనాడు) వీరరాఘవ స్వామిపై భక్తి ప్రపత్తులు పెంచుకొనిరి. వీరికి భాగవతాభిమానము హెచ్చు. వీరు ఇంక కొంతకాలము జీవించి యుండిన ప్రజోపయోగమైన, మతప్రశస్తిని చాటు రచనలు వారి లేఖిని నుండి వెలువడి యుండవచ్చునని నమ్ముటలో ఇసుమంతయు సందియము లేదు

ఏ కార్యమైనను నెరవేరుటకు విత్తము ప్రధానము కదా ! ఈ పుస్తక ప్రచురణకు ధనము సమకూర్చిన మా తమ్ముడు శ్రీరామ దేవశర్మ కుటుంబము నకు వరదాభయ కోదండరామస్వామి ఆయురారోగ్యైశ్వర్యములు ప్రసాదించుగాక

కోరిన వెంటనే తమ అమూల్యాభిప్రాయమునొసంగి, పుస్తక ప్రశస్తిని, రచయితపై పూజ్యభావమును, మార్గదర్శకత్వమును ప్రకటించిన విద్వాన్ కె.యి.టి రామానుజాచార్యులు, ఎమ్.ఏ., గారికి నా హృత్పూర్వక అభివాదనలు విశిష్టాద్వైతమత ప్రవక్త, ఆచార్యుడు అయిన రచయితపై భక్తి భావమును ప్రణతి ద్వారా ప్రదర్శించిన లక్ష్మీ నృసింహ కృపాపాత్రులు ఆచార్య అబ్బరాజు శ్రీనివాస మూర్తి, ఎమ్.ఏ., కి కృతజ్ఞతాపూర్వక ఆశీస్సులు. అనతి కాలములో గ్రంథముద్రణ కావించిన వెల్‌కం ప్రెస్ వారికి అభినందనలు.

చివరి మాట : శ్రీ వీరరాఘవస్వామి పరమ పదించినపుడు వారి యనుంగు సోదరులు, మాతండ్రిగారైన శ్రీసూర్యనారాయణ గారు అన్నగారిపై భక్తి ప్రపత్తులతో ఈ శ్లోకమును ప్రసాదించిరి.

శ్లో ॥ అబ్రాడ్వంశపయోధిశీత కిరణమ్ । శ్రీరామ సేవారతమ్ ।
శ్రీమత్ కౌశిక శ్రీనివాస కరుణా సం లబ్ధ మంత్రోత్తమమ్ ।
పాండిత్య ప్రతిభా విభాసమనఘం శ్రీకృష్ణదాసాశ్రితమ్ ।
వందే హారిత వీరరాఘవ గురూత్తమ్ సంసుధీ పూజితమ్ ॥

దీనిని వారి శిష్యవర్గము స్వాచార్యతనియ శ్లోకముగా నిత్యము అను సంధించుచున్నారు.

మంగళమ్ మహత్.

**గుంటూరు** **డా॥ అబ్బరాజు సీతారామచంద్రమూర్తి**
**16-9-02**